# PADYA KATHA LAHARI

For Telugu Comprehension Test

by

SRI NELATURU
BHAKTAVATSALAM AYYANGAR
VIDVAN. M.A., B.O.L.
Telugu Lecturer,
VIVEKANANDA COLLEGE, MYLAPORE.

(Approved by the Text Book Committee,
F. S. G. G. 24—5—49 P.B.)



*Vedam Venkataraya Sastry & Bros.,*
4, Mallikeswarar Koil South Lane,
LINGHI CHETTY STREET G. T., MADRAS
1949

Rs. 1/-

శ్రీ

# పద్యకథాలహరి

కూర్పరి


విద్వాన్. నేలటూరు భక్తవత్సలయ్యంగారు ఎమ్ ఏ., బి ఓ యల్.

ఆంధ్రోపన్యాసకుఁడు, వివేకానంద కళాశాల, మదరాసు.



ప్రకాశకులు:

శ్రీ వేదము వేంకటరాయశాస్త్రి అండ్ బ్రదర్స్,

4. మల్లికేశ్వరగుడిసందు, లింగిసెట్టివీథి,

ముత్యాలపేట, మదరాసు.

1949.

# తొలిపలుకు

ఇప్పటి ప్రవేశపరీక్షాప్రణాళికను ఎఱింగినవారికి పద్యకథాగ్రంథముల యక్కఱను విస్తరించి చెప్పవలసిన యక్కఱయుండదు. గతసంవత్సరము మదరాసు ముత్యాలపేట పాఠశాలలో నే నాంధ్రాధ్యాపకుఁడనుగా నున్నతఱి ఏర్పఱిచిన పద్యకథలనే ఇట్లు ఈ గ్రంథరూపమునఁ గూర్చినాఁడను. పూర్తికథనే సంగ్రహముగ వ్రాయుమనుటయో కథపై 'చిల్లర ప్రశ్నల'కు బదులు రాఁబట్టుటయో పరీక్షలలో క్రమమైయున్నందున నొక్కొక్క పాఠమునకును టిప్పణి తుద నట్టి ప్రశ్నలఁ గూర్చితిని. ఇది విద్యార్థులకును ఉపాధ్యాయులకును మిక్కిలి యుపయోగపడునని విశ్వసించి దీనిం బ్రకటింప ననుగ్రహించి సాధుపాఠములఁ గూర్ప నెంతయు ననువుగా ఈ కథలుగల మూలగ్రంథములకు కీ. శే. తమతాతగారు సర్వతంత్రస్వతంత్రులు సంస్కరించి యుంచుకొన్న సొంతప్రతుల నొసంగి సాయపడిన నామిత్రరత్నము బ్రహ్మశ్రీ వేదము వేంకటరాయశాస్త్రి, ఎం. ఏ., గారికి అత్యంతము కృతజ్ఞుఁడను.

ఉ. వేంకటరాయశాస్త్రి నలవేదవరాన్వయ వార్ధిసోముని౯
వేంకటరాయశాస్త్రి కవివీర వరాగ్రగ పౌత్రు నిష్టుని౯
వేంకటపూర్వ సద్రమణ వేదవిదాంవర సూనున గ్రజు౯
వేంకటశైలనాయకుఁ డపేక్షితలోకుఁడు దేర్చిప్రోచుత౯,

మదరాసు
14-7-1947

ఇట్లు, సుజనవిధేయుఁడు
భక్తవత్సలము.

# విషయసూచిక.

శ్రీః

# పద్యకథాలహరి

## 1. మోసపోయిన హంస.

సీ. హంసయొక్కఁడు రాత్రియందు సరసిలోనఁ
[1]కుముదషండము వెదకుచుఁ జరించి,
మెండగు నక్షత్రమండలీ ప్రతిబింబ
ములఁ గాంచి, వానిం గుముదము లనుచుఁ,
దినఁ బూని కావని తెలిసి రే[2]నిట్రుగాఁ
బుచ్చెఁ పిమ్మటఁ బవల్ మెచ్చుగాఁగ
బెక్కులు కుముదముల్ [3]పిక్కటిల్లఁగఁ గని
[4]సత్వంతతుల ప్రతిచ్ఛాయ లనుచుఁ
తే. దినక నిట్రుగనే పవలిసి గడపెను;
ఇట్టిదే యిది, మోసపోయిన మనుజులు
నిజము ప్రత్యక్షముగ మ్రోల నెగడుచున్న
మోస మని యెంచి మోసమె పొందుచుంద్రు.

ఆంధ్ర హితోపదేశచంపువు. సంధి.

టీ. 1. తామరల సమూహము. 2. ఉపవాసము, పస్తు. 3. వర్ధిల్లుచుండఁగా. 4. నక్షత్రసమూహముల ప్రతిబింబములు.

ప్రశ్నః—1. హంస ఏల రాత్రి పస్తుండెను? 2. అది మఱునాఁటి పగటియందును ఏల పస్తుండెను? 3. ఈహంస నడవడివలన దెలియనగు నీతియేమి?

## 2. గజోపాఖ్యానము,

సీ. కలదు వింధ్యాటవి గజరాజ మొక్కటి
[1]తత వజ్రసన్నిభదంతశోభి
[2]హస్తిపుఁ డొక్కఁడా హస్తి నేర్పునఁ బట్టి
గొలుసున నొక [3]తాటఁ [4]గుదియఁగట్టి
మ్రానెక్కెఁ; నంత నా యేనుఁగు [5]కొమ్ముల
సంకెలఁ ద్రెంచుచో [6]సరభసమున
నామ్రాని విఱుచునో యని వాఁడు దానిపై
కుఱికెద నని తప్పి యుర్విఁ బడిన

గీ. వానిఁ గనుఁగొని కరుణ నవ్వారణేంద్ర
మిట్లుపడియున్నవాని నింకేల చంప
ననుచు మన్నించి తన భూమి కరిగె, నడవి
జంతువులయందుఁ [7]బుణ్యవాసనలుగలవు ?

మడికిసింగన జ్ఞానవాసిష్ఠము. ఆ. 5. ప. 159.

టీ. 1. విరివియైన, తెల్లరత్నమును బోలిన, కొమ్ములతో ప్రకాశించునది. 2. మావటివాఁడు. 3. తాటిచెట్టున. 4. గట్టిగా. 5. దంతములతో. 6. వేగముచే. 7. ధర్మబుద్ధులు.

ప్రశ్నలు:—1. ఈకథలో ప్రస్తావింపఁబడిన యేనుఁగు నివసించిన దెచట ? 2. దానిని మావటీఁడు ఎచట బంధించెను ? 3. ఎటనుండి దానిపై కతఁడు ఉఱుకఁ గోరెను ? 4. ఏనుఁగు అతని నేల చంపక విడిచెను. 5. గజోపాఖ్యానంపు నీతియేమి ?

## 3. వ్యాధోపాఖ్యానము.

సీ. ఒకకానలోపల నొక కిరాతుం డేటు
వడి పాఱుమృగము వెంబడిన బఱచి
కానక, యచ్చోట మౌని నొక్కనిఁగాంచి
'యెటువాఱె మృగ'మని యిట్లోకింత
యద్భుతంబుగ వానినడిగిన, న మ్మౌని
'సౌఖ్య మౌనుల, మేము సముల, మడవి
నుందుము, వ్యవహార యోగ్య మౌనట్టి య
హంకార మెందు మాయాత్మ లేదు,'—
గీ. అనెడు మునినాథు పలుకుల కర్థ మెఱుఁగ
కాకిరాతుఁడు దనయిచ్చనవల నరిగె
*నఖిల సంకల్పములఁ బాసి నాతఁ డట్లు
[1]తుర్యపదమును బొందు సుస్థైర్యలీల.

మడికిసింగన జ్ఞానవాసిష్ఠము. ఆ 5. ప 269.

1. [జాగ్రత్స్వప్న సుషుప్త్యవస్థలు కాక] నాలుగవయవస్థ= జ్ఞానదశ.

ప్రశ్నలు:—1. కిరాతుఁడు మౌని నేమని యడిగెను ? 2. మౌని కిరాతున కేమని బదులుచెప్పెను.

## 4. మే ధా వి.

సీ. బాలధి యను మునిప్రవరుండు [1]పుత్త్ర శో
కాపన్నుఁడై, ఘోర మగు తపంబుఁ

జేసి, వేల్పుల దయఁ [2]చిరజీవిగాఁ బుత్త్రుఁ
బడసె, మేధావి [3]నాఁ బరఁగువాని;
వాఁడు నాయుష్యగర్వమున మునీంద్రుల
నెవ్వరి [4]మెచ్చక, యోఁగి యొక్క-
ధనుషాక్షుఁ డను తపోధను నొద్ద గర్వించి
పలికిన, నలిగి తపస్వి వాని
ఆ. [5]నంతకాంతికమున కరుగంగఁ జేసె; గ
ర్వంబు చెట్ట యెట్టి వారికైనఁ,
[6]గ్రాఁచుఁ దక్షణంబ గర్వంబు; గర్వంబు
నొడిచియున్నవాఁడ యుత్తముండు.

ఆరణ్యపర్వము III.

టీ. 1. కొడుకును పోఁగొట్టుకొనిన దుఃఖముచే బాధపడినవాఁడై. 2. చావులేనివానినిగా. 3. అను పేరుతో నొప్పు. 4. లెక్కింపక. 5. యమునియొద్దకు. 6. నశింపఁజేయును.

ప్రశ్నలు:—1. బాలధి ఎవరు ? 2. అతనికిఁగల్గిన దుఃఖమేమి ? 3. కొడుకును పొందుటకు ఆతఁ డేమిచేసెను ? 4. బాలధి ఎట్టిపుత్త్రుని బడసెను. 5. బాలధి పుత్త్రుని పేరేమి ? 6. మేధావి ఏల గర్వించెను ? 7. ధనుషాక్షుఁడు మేధావి నేమిచేసెను ? 8. మేధావికథకు నీతియేమి ?

## 5. బుద్ధిగలవారు గెలువనోపుదురు పరుల.

సీ. [1]యజ్ఞార్థమనుచు [2]ధరామరుఁ డొక్కఁడు
కొని యొక మేషంబుఁ గొంచురాఁగఁ
దెరువున దుర్జనుల్ [3]దృష్టించి తమలోన
మోస పుత్తము గాక మునిని నటంచుఁ

'గడు [4]నిర్దయాత్ముఁడుగా కుర్వి విప్రుండు
వెఱవక హింస గావించు టెట్లు?
గనుఁగొన్న మాకెల్ల గనికరం బయ్యెడు
దీనిఁ జంపఁగ సమ్మతించుట కిది'

గీ. యనఁగ నమ్మి చింబోతుఁ దానచటఁ గట్టి
యాతఁ డాచమనార్థమై [5]యరుగఁ దడవ
[6]సరభసంబునఁ జీబోతుఁ జంపి తినిరి;
బుద్ధిగలవారు గెలువ నోపుదురు పరుల.

పంచతంత్రము-సంధి.

టీ. 1. యజ్ఞము కొఱకని. 2. బ్రాహ్మణుఁడు. 3. జూచి. 4. క్రూర చిత్తుఁడు. 5. పోయినవెంటనే. 6. శీఘ్రముగ.

ప్రశ్నలు:—బ్రాహ్మణుఁడు మేషము నెందులకు తెచ్చెను? 2. దొంగలతని నెట్లు మోసపుచ్చిరి.

## 6. కిరాటోపాఖ్యానము.

సీ. [1]జిలిబిలి శృంగంపు సీమ చూ వింధ్యాద్రిఁ
గలఁడు కిరాటుఁ డొక్కరుఁడు, భార్య
యును దాను [2]నార్తుఁడై ముని వోలెఁ దిరుగుచు
నొక్క [3]జాంగల భూమి నొక్క గవ్వ
కసవుమాటున నున్నఁ గనుఁగొని [4]కృపణుఁ డై
గదియంగఁ జని యది గాన లేక
యచ్చోటఁ గసవు గాం డ్రంతయుఁ [5]బుచ్చి య
త్నంబున దివసత్రయంబు వెదక

గీ. సంత 6పూర్ణేందు మండలం బనఁగ వెలుఁగు
7నమర మణి యబ్బె నతనికి; నట్లు గవ్వ
వెదక మణి యబ్బినట్లు కోవిద గురూప
దేశగతి నాత్మ బోధంబుఁ దెలియ బొందు.

జ్ఞానవాసిష్ఠము. ఆ. 5. ప. 138.

టీ. 1. అందమగు ప్రదేశము. 2. దుఃఖితుఁడై. 3. మెరక నేల. 4. నీచుఁడై. 5. పెఱికివేసి. 6. నిండుచందురుబింబమో యనఁదగి. 7. చింతామణి.

ప్రశ్నలు:—1. కిరాటుఁ డేల మునివోలె దిరుగుచుండెను ? 2. అతనికి గవ్వ ఎచ్చట అగపడెను ? 3. గవ్వకై వెదకినందులకుఁ గల్గిన ప్రయోజన మేమి ?

## 7. చింతామణ్యుపాఖ్యానము.

సీ. సర్వగుణాఢ్యుండు 1శాస్త్రియు నయ్యును
దజ్ఞుండునగు నొక్క ధన్య పురుషుఁ
డవని వారి కసాధ్య మైన చింతామణిఁ
బడయంగఁ గోరి తపంబు సేయ
నా మణి ప్రత్యక్షమై చేతి కబ్బినఁ
గని యాత్మ సంశయమున నతండు
'నిమ్మణి యిటు వేగ యిది యెట్లు వొందెదు'
నని యూరకుండిన నదియు మఱలె ;
గీ. నతఁడు మఱియును బహు తపం బాచరింపఁ
గన్నులకుఁ దోఁచె నొక మంచి గాజు పూస ;

యిదియ సుర రత్న మని యిచ్చనెంచె దాని,
పుడమిఁ [2]గోలలు [3]విభ్రాంతి పొందు టరుదె ?

జ్ఞానవాసిష్ఠము. ఆ 5. ప 155.

1. శాస్త్రము తెలిసినవాఁడు. 2. తెలివిలేనివారు. 3. మోసము.

ప్రశ్నలు:—1. చింతామణి యగపడినపుడు శాస్త్రికిఁ గల్గిన సంశయమేమి ? 2. శాస్త్రి రాజుపూసంగాంచి ఏమనుకొనెను ? ఏల ?

## 8. వాగ్దోషము.

సీ. ఒక యూర నొక [1]చాకి యొక్కగాడిదఁ దెచ్చి,
దాని [2]లావుగ మేపఁ దలఁపు పుట్టి,
పులి తోలు పైఁ గప్పి [3]పొసఁగఁ బండిన [4]చేలు
మేయ రాత్రులు దోల, మేసి తిరుగఁ,
బులి యను బుద్ధి నా పొలము కావలివారు
దూరంబుననుఁ జూచి తొలఁగి పఱవఁ,
బైరెల్లవృథయైనఁ బరికించి, యొక నాఁడు
విసివి యొక్కరుఁడు సాహసముతోడఁ

తే. గడఁగి దూరంబునందునఁ గంబళంబు
గప్పికొని, వింట శర మిడి కాచి యుండ,
నా ఖరము వచ్చి యాతని నచటఁ గాంచి
[5]పెంటి గాడిదయని [6]యార్చెఁ [7]బృథురవమున. ౧

క. "పులి యని పాఱితి, నక్కట
[8]బలు గాడిద, [9]యెలుఁగు కతనఁ బైఁ లయ్యె; నిఁకన్

దొలఁగ భయం బే''లని యతఁ
[10]డలఘు ప్రదరమునఁ దాని యసువులఁ బాపెఁ. ౨

పంచ.

టీ. 1. చాకలి. 2. బలియున్నట్లు. 3. బాగుగా. 4. పొలములు. 5. ఆఁడుగాడిద. 6. అఱచెను. 7. పెద్దధ్వనితో. 8. బలిసిన. 9. కంఠధ్వనిఁ బట్టి. 10. పెద్దబాణముచే.

ప్రశ్నలు:—1. గాడిదను లావుగ మేపుటకు చాకలి ఏమిచేసెను? 2. పొలము కావలివారు గాడిదనుజూచి ఏల పరుగిడిరి ? 3. పైరు మేయు చుండినది పులికాదు గాడిదయని ఎట్లు తెలిసెను ? 4. తుదకు గాడిద ఏమయ్యెను ?

## 9. మంకి చరిత్రము.

సీ. మంకి నాఁ బరఁగు బ్రాహ్మణుఁడు ధనేచ్ఛమై
వర్తించి [1]శిక్షింప వలయు నట్టి
[2]గుజ్జు కోడెల [3]జట్టిఁ గొని ప్రీతి [4]లంకించి
యుండ, [5]లంకియతోన [6]గండు మీఱి
పాఱె నక్కోడియల్ పడి యున్న [7]చనుప లొ
ట్టెనుంగుపై; నది యెగిసి పఱవ
నుభయ పార్శ్వంబుల నురి వోసి నట్లవి
వ్రేలి చచ్చినఁ జూచి విప్రుఁ డడలి,
'రత్నములఁ బోని [8]వత్సతరంబు లకట
వ్రేలు చున్నవి లొట్టియ వెంటఁ దగిలి'
యనుచు [9]నిర్వేదనము నొందియనియెఁ దన్నుఁ
గరుణ తోడఁ గనుంగొను నరుల తోడ. ౧

గీ. 'సారమతిఁ బరికింపంగఁ బౌరుషంబు
కంటె దైవంబు ముఖ్యంబు ర్యసిద్ధి;
కెచట నేనియుఁ బౌరుష [10]మెసక మెస
నేని యది దైవదత్తంబ యింత నిజము.' ౨

భార. శాంతి. iii.

టీ. 1. తర్బీదుచేయ. 2. పొట్టియొద్దల. 3. వెలయిచ్చి. 4. పెనవేసి. 5. పెన. 6. పొగరు. 7. బిడారుయొక్క యొంటెమీఁద. 8. కోడెలు. 9. విరక్తి. 10. విజృంభించినయెడల.

ప్రశ్నలు:—1. బ్రాహ్మణుఁడు కోడెల నేలకొనెను ? 2. కొనిన కోడెల నతఁ డెట్లుంచియుండెను ? 3. కోడె లేలచచ్చినవి ? 4. విరక్తిచే నావిప్రుఁ డేమిచెప్పెను.

## 1 . పూజనిచరిత్రము.

సీ. బ్రహ్మదత్తుం డనఁ బరఁగిన నరపతి
[1]నగరఁ బూజని యను నామ మొప్పఁ
[2]జతురభాషిణి యొక్క [3]శారిక వర్తించు;
నది పిల్లఁ బెట్టి యిం పారు పండ్లు
తెచ్చి యర్మిఁ దాని కిచ్చుచో మే లేఁ
యధిపు పుత్త్రున కిచ్చు నందుఁ గొన్ని ;
వాఁడును మచ్చిక వచ్చి యప్పిల్లతోఁ
జర్లాట మాడుచు సంచరించు;
ఆ. నొక్కనాఁడు దాది యొద్ద లేకుండ న
ద్దారకుండు పిల్ల తల నొగిల్చి

చంపె. దానితల్లి సనుదెంచి కని మది
నిట్టులనియె శోక [4]మెసక మెసఁగ. ౧

ఆ. "రాచకొమరు గాఁడె! రాచవారికి నేటి
పరిచయంబు? వేగ కరుణ విడుచు;
హితవు మఱచు, రాజు లెందు నమ్మికకుఁ బా
త్రములె సమద మతులు క్రౌర్యరతులు? ౨

క. ఈపగ దీర్చెద" నంచుం
గోపంబున రాజుకొమరు గ్రుడ్డులు రెండుం
బోపడునట్లుగ గోళ్లఁ
వేపెఱికి రయమున గగన వీథికి నెగసెఁ. 3

భార. శాంతి. iii.

టీ. 1. భవనమున. 2. నేర్పుగల్గి మాటాడునట్టిది. 3. గోరవంక. 4. అతిశయముకాఁగా.

ప్రశ్నలు:— 1. పూజని ఎవరు ? 2. రాజపుత్రు నెట్లు పూజని గౌరవించుచుండెను ? 3. రాజపుత్రుఁ డేమిచేసెను ? 4. శారిక ఎట్లు పగదీర్చుకొనెను ?

## 11. హీనమతికి బుద్ధు లేల కొలుపు?

సీ. [1]సొరిది [2]విహరించు కపు లొక చోటఁ గూడి
[3]కడిది చలిచేత [4]మేనులు గడు వడంక
రాత్రి మెఱుఁగారు [5]ఖద్యోతరాజిఁ జూచి
[6]కణఁగు గాబోలు నని [7]సీతు గాఁచు చుండ. ౧

క. సూచీముఖ మను విహగం,
బాచేరువనుండి యనల మది గాదని యా
లోచనముచేసి యొక కపి
కాచందము తెలియఁ జెప్ప నది కుపితంబై. 2

గీ. 'అడుగ కూరకేల నొడివితి విప్పఁను?
వట్టి తీఁట నీకుఁ బుట్టె' ననుచుఁ
బట్టి దాని రాతిపైఁ [8]బ్రామి వధియించె;
హీనమతికి బుద్ధులేల [9]క్రొలుపు. 3

పంచ. మిత్రభేదము.

టీ. 1. క్రమముగ. 2. ఆడుకొను. 3. ఎక్కువ. 4. దేహములు. 5. మిడుఁగుఱుఁబురువుల గుంపును. 6. నిప్పు. 7. చలి. 8. ఊఁచి. 9. సరిపడును.

ప్రశ్నలు:—1. చలికి కోతు లేమిచేసినవి? 2. సూచీముఖము కోతులకుం జెప్పినదేమి? 3. క్రోతికి బుద్ధిగఱపిన పక్షి కేమాయెను? 4. ఈకథకు నీతి ఏమి?

## 12. ద్రోణద్రుపద చరిత్రము.

సీ. ఆది భరద్వాజుఁ డను ముని కలశంబు
నం దుద్భవించిన యనఘ మూర్తి
ద్రోణుండు, మఱి పృషతున కుద్భవించిన
ద్రుపదుండు, నొక్కటఁ దొడఁగి యిష్ట
సఖు లయి వేదముల్ సదివి, ధనుర్వేద
మగ్నివేశు తోడ [1]నర్థిఁ గఱచి

చని, ద్రుపదుండు పాంచాలభూములకు రా
జైన, భారద్వాజుఁ డతని కడకు
ఆ. నరిగి వానిచేత నవమానితుం డయి
హాస్తిపురికి వచ్చి యఖిల కురుకు
మారవరుల నెల్ల [2]మానుగా శస్త్రకో
విదులఁజేసె లోకవిదిత యశుఁడు.

క. ప్రతిజ్ఞాదర్ప ద్రుపదు [3]ర
థాక్షముతోఁ గట్టి తెచ్చి యర్జునుఁడు [5]క్రియా
దక్షుం డయి గురునకు గురు,
దక్షిణగా నిచ్చి చేసెఁ దత్సమ్మదముఁ.
ఆ. 'ఇంకనైన మమ్ము నెఱుఁగంగ నగు నొక్కొ?'
యనుచు [6]నుల్లసంబు లాడి ద్రుపదు
విడిచి పుచ్చె గురుఁడు; విప్రుల యలుకయుఁ
[7]తృణహుతాశనంబు దీర్ఘమగునె? 3

భార. ఆది.

టీ. 1. అక్కఱతో నేర్చి. 2. బాగుగ. 3. రథచక్రమునకు. 4. కార్యసమర్థుఁడు. 5. అతనికి సంతసమును. 6. మర్మముదాఁటి పాఱఁబరిహసించి. 6. గడ్డిపోఁచ కంటిననిప్పు.

ప్రశ్నలు:—1. ద్రోణ ద్రుపదుల తండ్రులెవరు? 2. వారి యుపాధ్యాయుం డెవరు? 3. ద్రోణునకుఁ గల్గిన యవమానమేమి? 4. ద్రోణుఁ డెట్లు పగఁదీర్చుకొనెను?

## 3. యయాతి స్వీయచరిత్రము.

క. [1]అనవద్య ధర్మచరితం
బున నున్నతుఁడైన నహుషు పుత్త్రుఁడఁ బూరుం

డను [2]మధ్యమ లోకేశ్వరు
జనకుండ యయాతి యనఁగఁ జనియెడు వాఁడన్.

క. [3]అమిత తపోవిభవంబునఁ
గమలజు లోకంబు మొదలుగాఁ గల సుర లో
కములందుఁ బుణ్యఫలములఁ
గ్రమమున భోగించి యింద్రుకడకేఁ జనినన్.

క. సురపతి నా తపమున క
చ్చెరు వడి నీ తపముపేర్మిఁ జెప్పుమ యనినన్
సుర సిద్ధ మునీంద్ర తప
శ్చరణలు నాతపముతోడ సరి గా వంటిన్.

చ. అమర విభుండు దాని విని
యల్గి 'మదంబున నుత్తమావమా
నము దగు నయ్యెచేయ' నని
నన్ను [4]నధోభువన ప్రపాత సం
భ్రమ వివశాత్ముఁ జేసె నది
పాడియె; యెందును నల్పమయ్యె ద
ర్పము బహుకాల సంచిత త
పః ఫలహాని నొనర్పకుండునే.

భార. ఆది. iii

టీ. 1. పాపదూరమగు పుణ్యావర్తనమున గొప్పవాఁడగు. 2. భూలోకప్రభువుయొక్క. 3. కొలది యిడఁబడని తపస్సుయొక్క పెంపుచే. 4. క్రిందిలోకమునఁబడు త్వరచే స్వాధీనముతప్పిన మనస్కునిగా,

ప్రశ్నలు:—1. యయాతియొక్క తండ్రి దేనిలో నున్నతుఁడు ? 2. యయాతికి వెనుక మధ్యమలోకేశ్వరుఁ డెవఁడు ? 3. యయాతి యనుభవించిన తపఃఫలము లేవి. 4. అతనికి తపఃఫలహాని ఎట్లుగల్గె ?

## 14. ద్రోణుఁడు కౌరవపాండవులఁ బరీక్షించుట.

క. [1]మానుగ రాజకుమారుల
తో [2]నొక్కట నొక్కనాఁడు ద్రోణుఁడు గంగా
స్నానార్థ మరిగియందు మ
హానియమస్థుఁ డయి నీళ్ల [3]నాడుచు నున్నన్. ౧

క. [4]వెఱ చఱవ నీరిలో [5]నొ
క్కటిగా నొక మొసలి చూడ్కికి నగోచరమై
పఱతెంచి కుంభసంభవు
చిఱుదొడ వడిఁ బట్టికొనియె శిష్యులు బెదరన్.

క. దాని విడిపింప ద్రోణుఁడు
దానవుఁడు సమర్థుఁడయ్యుఁ దడయక పనిచెన్
దీని విడిపింపుఁడని నృప
సూనుల[6]శర సజ్య చాప శోభిత కరులన్.

శా. దానిన్ నేరక యందఱున్ వివశులై
తారున్న, నన్నీరిలోఁ
గానం గాని శరీరముం గల మహో
గ్రగ్రాహమున్ [7]గోత్రభి
త్సూనుం డేను శరంబులన్ విపుల తే
జొండేసి శక్తిన్ [8]మహో

సేనప్రఖ్యుఁడు ద్రోణజంఘు విడిపిం
చెఁ విక్రమం బొప్పగా. ౪

భార. ఆది. ౮

టీ. 1. వినోదముగా, వేడ్కతో. 2. కూడ. 3. స్నానము చేయుచు. 4. భయపడునట్లు. 5. ఉగ్రముగా. 6. బాణములచేతను ఎక్కుపెట్టఁబడిన విల్లుచేతను వెలుఁగొందుచుండు చేతులు గలవారిని. 7. ఇంద్రసుతుఁడు. 8. కుమారస్వామి వంటివాఁడు.

ప్రశ్నలు:—1. ద్రోణుఁడు గంగ కేల పోయెను? 2. అతని నెవరు వెంబడించిరి. 3. స్నానసమయమున ద్రోణున కేమాయెను? 4. చిఱు దొడను మొసలి పట్టుకొనఁగా ద్రోణుం డేమిచేసెను? ఏల? 5. ఎవరెట్లు ద్రోణుని విడిపించిరి.

## 15. కుండధారుం డను దేవానుచరుని వృత్తాంతము.

సీ. యజ్ఞార్థ మొక్క బ్రాహ్మణుఁడు ధనార్థియై
తపము సేయఁగఁగుండధారుఁ డనఁగఁ
బరఁగెడు [1]దేవానుచరుఁ డచ్చటికి వచ్చి
'యభిలాష మే రూప' మనుఁడు '[2]నర్థ
సిద్ధిఁ గోరెద' నని చెప్పినఁ బ్రీతి నా
తఁడు మాణిభద్రుని ధనదభృత్యు
నియతిఁ దలంప సన్నిధి సేసె న య్యక్షుఁ;
డతఁడు 'మదాశ్రితుం డైన యితని
తే. ధనసమగ్రునిఁ జేయవే' యనిన 'నెంత
ధనము వలసిన నిచ్చెద' ననియె మాణి
భద్రుఁ; డమ్మహాత్ముఁడు [3]మర్త్యభావ మస్థి
రత్వ దూషిత మను విచారంబు పుట్టి, ౧

ఆ. యక్షువడనితోడ నవ్విచారము మృదు
వచన రచనఁ జెప్ప,వాఁడు దాని
కాత్మఁ బ్రీతిఁ బొంది యనుమతి సేయంగ, ౨.
నధిక భక్తి నిరతుఁడై యతండు

క. దేవతలను బ్రార్థించిన
నావసుధామరుని చిత్త మాప్రొద్ద తప
స్సేవన తత్పర మయ్యెను
దేవానుచరుండు వోవ దివికిఁ; ద్విజుఁడున్.

క. క్రమమున జలపవనము లశ
నములుగఁ గొని తపము సేసినం గాయముఁ జి
త్తము మానుషంబు లగు చం
దములు విడిచి [4]దివ్యమహిమ ధామము లయ్యెన్.

భార. శాంతి. V

టీ. 1. దేవదూత. 2. ధనలాభము. 3. మనుష్యత్వము. 4. అద్భుత ప్రభావమునకు స్థానములు.

ప్రశ్నలు:—1. బ్రాహ్మణుఁ డేల తపంబొనరించెను ? 2. కుండధారుండు ప్రత్యక్షమై చేసినదేమి ? 3. మణిభద్రుఁ డెవరు ? అతఁడేమి ఇచ్చెదననెను ? 4. దేవానుచరుఁడు ద్విజునకై యక్షుంగోరినది దేనిని ? ఏల ? 5. ద్విజునకుఁగల్గిన తపఃఫలంబేమి ?

## 16. శాపముసలము.

క. ద్వారవతికిఁ గణ్వుండును
నారదమునివరుఁడు [1]గాధినందనుఁడును బెం
పారంగఁ దొల్లి వచ్చిరి
నారాయణుఁ జూచుఁ వేడ్క నరవరముఖ్యా.

సీ. చను దెంచి పురవీథిఁ జను నవసరమున
2వృష్ణికుమారులు 3విధివశమున
మనముల నవినీతి జనియింప సాంబున
4కంగనాలంకార మమరఁ జేసి
కొని వచ్చి య మ్మహాముని వర్గమునకు 5మి
థ్యా వినయమున వందన మొనర్చి
6నిభృతులై "కారుణ్యనియతాత్ములార! యీ
భామిని బభ్రుని భార్య; 7ప్రజలఁ
గను నె యిది?" యని యడిగినఁ గౌరవేంద్ర
య త్తపోధన వర్యు ల 8య్యాగడమున
కాత్మలందుఁ గ్రోధానల మగ్గలముగ
నెలయ నక్కుమారులతోడ నిట్లు లనిరి.

క. "అంబుజనాభుని కొడు కీ
సాంబుఁడు గను యాదవ క్షయాపాదన 9క
ల్యం బగు ముసలము మావచ
నంబున కనృతంబు లేదు; నమ్ముఁడు మీరల్."

క. విని 10కాలవేదియగు న
11వ్వనజాక్షుఁడు 12నియతి నగు నవస్థకుఁ దలఁపం
జన 13దన్యథాత్వ కరణం
బని యూహించుచు నుపేక్ష యాత్మ వహించెన్. ౪

టీ. 1. విశ్వామిత్రుఁడు. 2. యాదవులు. 3. దైవప్రేరణచే. 4. ఆడువేసము. 5. కపటమైన యడఁకువతో. 6. దిట్టలై. 7. బిడ్డలను. 8. అకార్యము. 9. సమరము. 10. కాలము నెఱిఁగినవాఁడు. 11. కృష్ణుఁడు. 12. దైవవశమున. 13. వేఱుపఱచుట, మార్పు.

ప్రశ్నలు:—1. కృష్ణుం జూడవచ్చినమును లెవరెవరు ? 2. వృష్ణి కుమారులు గావించిన యాగడమేమి ? 3. మును లేమనిశపించిరి ? 4. శ్రీకృష్ణుఁ డేల యుపేక్షించెను ?

## 17. చోరరాక్షసులు.

చ. ఘన మగు నగ్రహారమునఁ
గర్మవిదుం డొక బ్రాహ్మణుండు పా
వనచరితుండు గోవులఁ బ్ర
వర్ధన మొందఁగ రెంటి మేపఁగాఁ
గనుఁగొని తాఁ బ్రమోదమునఁ
గైకొనఁగాఁ దఱివేచియుండు 1మ్రు
2చ్చనిశము; నొక్కనాఁ డొక మ
హానిశి నొక్కఁడుఁ బోవుచుండఁగన్. ౧

సీ. ఎదురుగా నొక్కరుఁ డేఁగు దెంచిన, వాని
3దరలక చోరుండు దాఁకి బెదరి
'యెవ్వండ?' వనుటయు, 'నే బ్రహ్మరాక్షసుఁ
డను; నన్నుఁ దాఁకిన ఘనుఁడ వైన
నీ వెవ్వఁ' డనుటయు, 'నేమ్రుచ్చుఁ, బా'మ్మన,
'నింత ప్రొద్దెచ్చటి కేఁగె?' డనిన,

'నీపురిలోన మహీసురోత్తము ధేను
వులు రెండు మంచివి గలుగఁ జూచి,
గీ. యపహరించు కొఱకు నరిగెద నే;' నన్న,
'నేను నతనిఁ బట్టి నిపుడు వత్తు,
ర'మ్మటంచుఁ గదలి బ్రహ్మరాక్షసుఁడును
నతఁడు నంతఁ గూడి యతని గృహము. ౨

వ. కదియంబోయి 'ఏన నేన ముందు బోవుదు'నని మెల
పెఱుంగక రొద కొట్టునంతట.

గీ. విని మహీసురవర్యుండు వితత మంత్ర
బలమునను బ్రహ్మరాక్షసుఁ బాఱఁదోల
నంత నట మున్న చోరుండు నరిగెఁ గానఁ,
బోసఁగ నహితులు దమలోనఁ బోర మేలు. 3

పంచ. సంధి.

టీ. 1. దొంగ. 2. ఎల్లప్పుడును. 3. చలింపక.

ప్రశ్నలు:—1. చోరుఁడు దొంగిలఁగోరినది దేనిని? 2. చోర బ్రహ్మరాక్షస సమాగమ మెట్లెప్పు డొడఁగూడెను? 3. చోర బ్రహ్మ రాక్షసులు దమలో నేల కలహించిరి?

## 18. భేరీజంబుకములు.

తే. ఎసఁగు నాఁకటి [1]పెల్లున నిందు నందు
నడవిఁ జరియించి, యాహార మబ్బ కునికి
నలసి, యొక జంబుకంబు భాగ్యమునఁ గాంచెఁ
గలహ మొనరించిపోయిన కదనభూమి. ౧

సీ. [2]అఱిముఱి నంతంతఁ దఱుచు ప్రోవులు గట్టి
[3]యఱవఱలై యున్న యరదములును,
వాండముల్ గొమ్ములుఁ దొడలు మస్తకములు
ఖండంబు లైన [4]వేదండ తతులుఁ,
జరణంబు లూరులు [5]బరులుఁ గంధరములు
దునుకలై పడియున్న తురగములును,
గంకణాంగదములఁ గడు నొప్పి విఱిగిన
బాహుదండంబుల భటకులంబుఁ,
గీ. గలిగి భీభత్స రౌద్రశృంగారములకు
నాస్పదంబుగఁ గనుపట్టు నట్టి నేల
కౌతుకంబునఁ బొడఁగాంచి కదియునంత
నవల నొక మహాధ్వని గుండె లవియ నిగుడ.
సీ. అమ్మహాధ్వని విని యత్యంత భయముతో
[6]మృగధూర్త మట్టిట్టు మెదల వెఱచి
కను మూసి తెఱవ, 'కెక్కడఁ జొత్తు' నని బుద్ధి
శోకించి, కనువిచ్చి చూచు నంత
ధారుణిఁ బడియున్న భేరీముఖంబునఁ
దరు శాఖ గాలిచేఁ దాఁకుచుండఁ
బొడఁ గని తన లోనఁ బొడమిన భయమెల్లఁ
బోయిన, నాభేరి డాయ వచ్చి
తే. "ఇది మహాభోగ్య మిచ్చట నొదవె నాకు
నిప్పుడిది వ్రచ్చు కొని చొచ్చి హిత మెలర్ప

వలయు మాంసంబు భక్షింపవచ్చు;'' ననుచు
నేచి యాభేరి ప్రచ్చి యం దేమి లేక. 3

వ. [7]వృథాస్థూలం బని పోయెం గాన శబ్ద మాత్రంబునకు శంకింపం బని లేదు.

పంచ. మిత్రభే.

టీ. 1. ఆధిక్యముచే. 2. సంభ్రమముతో. 3. తునుకలై. 4. ఏనుఁగుమొత్తములు. 5. పార్శ్వములు. 6. నక్క. 7. వట్టిమొద్దు.

ప్రశ్నలు:—1. నక్క యడవిజొచ్చి తిరిగినదెందులకు ? 2. నక్క యుద్ధభూమిపైఁ గాంచినది వేనిని? 3. నక్కకుఁగల్గిన వెఱపును అది తీసిన తెరగు నెట్టివి ?

## 19. కపట వ్యాఘ్రము.

క. నర్మద [1]దరి నిజ హింసా
కర్మం బొరు లెఱుఁగకుండఁ గాపురముండున్
ధర్మమునఁ జరించు కపట
ధార్మిక మొక్కపులి యొక్కతరుకుంజమునన్.

క. ఒక్కయెడం, దమలో నొక,
బొక్కకు [4]వాదడిచి [2]శశకముఁ [3]గపింజలముం
గ్రక్కునఁ బఱతెంచి పులికి
మ్రొక్కుచు నిజవాద మిరువురుం జెప్పుటయున్

తే. ముదిసినారము, కానము మున్ను వోలె;
శ్రవణముల దూరమును విను శక్తి లేదు;

కదియఁ జనుదెంచి చెప్పుడు కార్య'' మనుఁడు
నవియుఁ [5]దేకువ మాలి డాయంగ నడువ. 3

క. ముందటి కాళ్లంగొని యా
కుందేలుం [3]గైదుఁ బట్టుకొని గొంతుక సం
దంద గఱచి భక్షించి [6]య
తంద్ర ప్రీతిఁ బులి [7]శౌర్యతతమైయుండెన్. ౪

కేయూరబాహు. II

టీ. 1. గట్టున. 2. కుందేలు. 3. ఒకపక్షి. 4. వాదాడి. 5. భయము విడిచి. 6. ఎక్కువ సంతోషము. 7. శూరత్వముచే పెంపొందినదై.

ప్రశ్నలు:—1. కపటవ్యాఘ్రి మెచ్చట వసించియుండెను? 2. శశక కపింజలములకుఁ గల్గినవాదేమి? 3. పులి శశక కపింజలముల నెట్లుచంపెను.

## 20. నూనెకు సరిగా బియ్యమిచ్చుట.

క. కాంచీపురమున నొకరుఁడు
కాంచనగుప్తుఁ డను [1]బుద్ధిగల వైశ్యుఁ [2]డని
ర్వంచనుఁడు సుతున [3]కరయం
బంచెం బరిణయము సేయ బాలిక నొకతెన్. ౧

చ. పనిచినవారు వైశ్యకుల
బాలలఁజూచుచుఁ న[4]ప్పురాంగణం
బున నొక [5]క్రేవ నొక్కరుఁడు
మూటెఁడు ప్రాలకు నూనె సంతలోఁ

గోనఁ జనుదెంచి బియ్యమున
కుకా సరి తైలము వోయు మన్న నా
తని పలు కెవ్వరుకా వినక
తద్దయు నవ్వుచు గేలిసేయుచుకా. ౨

క. అనయము విడువక నడుగం
గని యచ్చటనున్న వైశ్యకన్య యొకతె యా
తనిఁజేరి "కలదునూనియ
కొనియెదవే రమ్ము [6]ప్రాలకును సరి లెక్కకా. ౩

క. ప్రాలొక్కటఁగొని దానన
తైలము దిగు వాఱఁబోయు దానను నీకుం
[7]బోలినఁ బ్రాలం గొలువుము
[8]చాలము నీతోడఁ బిదప జగడములాడకా. ౪

వ. అని యొడం బఱచి:

ఆ. పళ్లెరంబుఁ దెచ్చి పటుబుద్ధి బియ్యంబు
దానినిండఁ గొని ముదంబుతోడ
నందవోసెఁ దైల మంచులు దిగువాఱ
నవ్విధంబు మెచ్చు నావహింప. ౫

క చని కాంచనగుప్తునకుకా
వినిపించిరి యతనివాడు వేగము, యతఁ డం
దునఁ దద్బుద్ధి విశేషము
గొనియాడుచు దానిఁ దనదు కోడలిఁజేసెకా. ౬

టీ. 1. సంపద. 2. మోసకాఁడు. 3. వెదుకఁబంపెను. 4. ఆయూరిముంగిట. 5. ప్రక్క. 6. బియ్యమునకు. 7. సమ్మతమైన. 8. శక్తులముకాము.

ప్రశ్నలు:—1. కాంచనగుప్తుఁ డెట్టికోడలిం గోరెను. 2. సంతలో బియ్యపువాని నెల్లరేల గేలిసేసిరి ? 3. వైశ్యబాలిక బియ్యపువానిని మోసగించిన తెఱఁగెట్టిది.

## 21. వ్యాఘ్రోజ్జీవితపస్వి.

క. గార్గ్యుఁ డను విప్రుఁ డొకరుఁడు
[1]దుర్గారాధనముఁ బెక్కు [2]దొసఁగులఁబడుచున్
[3]దుర్గాటవిలోఁ జేయ [4]ని
రర్గళగతిఁ దన్నుఁ జూచి యాయంబికయున్. ౧

క. "వర మడుగు" మనిన మ్రొక్కుచు
సరభసమగు కాంక్షతోడ "సంజీవని [5]ని
ర్భర కరుణ న్నాకొసఁగుము
పరమేశ్వరి" యన్నినఁ గొన్ని పచ్చని యాకుల్.

చ. తలఁచిన మాత్ర నాత్మకర
తామరసంబున నున్న, వాని [6]ని
మ్ములఁ [7]గృప సేసి "వీని రస
ముం బయిపైఁ జిలికింపఁగా శవ
మ్ములకును బ్రాణముల్ గలిగి
ముందటిరూపమువచ్చి తేజముం

బలమును జెంది పూర్వగుణ
భంగిఁ జరించుటకల్లు నెల్లెడన్. 3

క. ఎండవు తఱుగ" వనుచు నిడి
చండికఁ బోడఁగానరాక చనుటయు మదిలోఁ
నిండిన సంతసమున వి
పుండవి కొని యాత్మ పురముత్రోవ కొకరుండున్. ౪

చ. చనునెడ నిమ్మశాఖ్యమగు
శచక్కటి నొప్పెను గాన నెండి పో
యిన యొక పుండరీక శవ
10మారము వెల్పలనున్నఁ జేరఁగాఁ
జని తన కన్న యూపథము
శక్తి నిజంబుగఁ జూడనెంచి చే
త నలిపి యాకులం బసరు
దాని పయిం బిడిచెంగుబుద్ధియై. ౫

చ. పిడిచిన నేమిచెప్ప నతి
భీకర దుస్సహ పుండరీక మ
ప్పుడ తన నిద్రమేల్కనిన
పోలిక మోగుచు 11బిట్టులేచి య
12వ్వాడఁ గగు విప్రుఁ గూయిడఁగఁ
జేసి మృతుం బొనరించి మ్రింగె; మే

ల్వాడసియు బుద్ధిచాలని య
భాగ్యులు తత్ఫలమంద నేర్తురే. ౬
కేయూ. II.

టీ. 1. పార్వతిసేవ. 2. ఇడుమలు. 3. చొరరానియడవిలో. 4. ధారాళముగా. 5. ఎక్కువదయతో. 6. ప్రీతితో. 7. ఇచ్చి. 8. చోట. 9. పెద్దయడవిలో. 10. పొదరిల్లు. 11. భయంకరముగ. 12. బుద్ధిహీనుఁడగు.

ప్రశ్నలు:—1. గార్గ్యుడు పార్వతింగోరిన వరమేమి? గార్గ్యుఁడు తాను సంపాదించిన యౌషధముయొక్క శక్తి నెట్లు పరిశీలించెను?

**22.** కరికర్ణాసరటప్రవేశము.

మ. ఒకనాఁ [1]డాతతనీరజాతవనతీ
రోపాంతకుంజంబునం
దొకచోఁ దొండలు [2]కాటులాడుటయునం
దొక్కండు విశ్రాంతి కో
ర్వక యొక్కండది వెంటరాఁబటిచి యే
వంకం జోరంజోటుగా
నక [3]కాంతారమదేభమూ కోలనిలో
నంజొచ్చి క్రీడించుచుఁ. ౧

క. తిరుగాడు చుండఁగాఁ గని
కరము భయ భ్రాంతమగుచుఁ [4]గరివర కర్ణాం
తర వివరము లోనికి నొక
[5]ఠొరటము గతి [6]సరటమంత దురదుర దూఱెన్, ౨

మ. అది చూత్కారముఁ జేసి కేల్ విదుర్చుచుం గొం
7చంభోజషండంబును
న్మదభంగిం బలుమోత్రతతో వెడలి ప
ల్లాటుల్ మహాఘీంకృతుల్
సెదరన్ వెండియుఁ దొండమున్ విదుర్చుచున్
శీఘ్రింబ పెన్నాకులుం
బొదలుం గూల్చుచుఁ బాఱ జైననిలయం
బుల్ సొచ్చి యుగ్రాకృతిన్.

గీ. 8అడ్డ జైనుల వధియించి యచటఁ 9గడచు
వడిన వసతులు వడఁద్రోచి వారణంబు
కొలను సొచ్చి సరోరుహకులము నెల్ల
మటల భగ్నముఁ గావించి దరికివచ్చి. ౮

క. సరసీజలముల నిండం
10గరములఁ బూరించి యూరఁగాఁబడి చెవిలో
గురిపించినఁ 11దల్లడపడి
సరటము బైటఁబడెఁ గరియు 12సమ్మదమందెన్. ౯

II.

టీ. 1. విరివియైన తామరకొలనుదగ్గఱి పొదయందు. 2. కలహించు టయు. 3. మదించిన యడవియేనుఁగు. 4. శ్రేష్ఠమగు నాయేనుఁగు చెవి యందలి రంధ్రములోనికి. 5. తొఱ్ఱలోనికి ఎట్లో అట్లు. 6. తొండ. 7. తామరతంపరయం దుండి. 8. అడ్డిన. 9. మిగిలిన యిండ్లను. 10. తొండ ముననింపి. 11. భయపడి. 12. సంతోషము.

ప్రశ్నలు:—1. తొండ ఏనుఁగుచెవింజొచ్చుట ఎట్లు సంభవించెను? 2. తొండ చెవింజొఱఁగా ఏనుఁగు ఏమేమిచేసెను? 3. ఈ కథకు నీతియేమి?

## 23. మధుబిందుకలహము.

క. ధరణి పయి లాట నరపతి
పురిఁ దేనియ నమ్మకొఱకు బోయల పల్లెం
జరియించుచుండు వాఁడొక
పురుషుండది యొక్క కలశమునఁగొని నడవన్. ౧

గీ. వడఁకుఁగొని నిలవఁద్రొక్కని యడుగు కొంత
జాఱి [1]మొగ్గతిలంబడఁ బాఱుటయును
నిండి మూఁపునఁ దాల్చినకుండ తొలఁకి
యొలికె మధుబిందులొక కొంత యుర్విమీఁద. ౨

సీ. ఆ తేనెబొట్టున కచట నీఁగలు ముసిరి
న, వానిఁ బట్టం గనని కడంకఁ
జేరె నచ్చటి కొక్క [2]చెలఁది, యాచెలఁది మ్రిం
గిన బల్లి నొక పిల్లి దినియె, నంత
నాపిల్లి గఱచె రాజాధీన మగు వేఁట
కుక్క యొక్కటి, దానిఁ గోప మడరఁ,
బొడిచె [3]బిడాలంబు, [4]పౌడయని నగరి కు
క్కలవారు చంపిరి కడఁగి దాని,
దాని వాఁడవారు తవిలి చంపించిరి
కుక్క నంతఁగినిసి కుక్క వేఁట

కాంత్రు రందఱేఁగి కతసవిస్తారంబు
నృపతితోడఁ జెప్ప నృపతి యలిగి. ౩

మ. [5]తగ వ్రాహింపక [6]యూరి [7]వాడ ప్రజలం
డాఁజంపఁగాఁ బంచినన్
జగతీవల్లభుఁడైన నేలయని యు
త్సాహించి సన్నద్ధులై
[8]నగరంగోల్వానివార లొక్కడెసనై
నానాయుధోపేతులై
[9]తెగి భూపాలకసేనఁదాఁకిరి మహో
ద్రేకంబుతో నార్చుచున్. ౪

ఉ. రెండుతెఱంగు మూఁకలును
రిత్తకు రిత్తచలంబు పెంపునన్
భండన ముగ్రభంగుల నొ
నర్పఁగఁ బెక్కులుద్రెళ్లఁ బీనుఁగుల్
కండలుఁ బ్రేవులుం గలసి
కాలువలై [10]యెసలారె నెత్తురుల్
[11]కుండల చాదు మస్తములు
గుప్పలు గట్టె పురంబు వీథులన్. ౫

కేయూ. II.

టీ. 1. మోకరిల్లునట్లు. 2. సాలెపురుఁగు. 3. పిల్లి. 4. రాజభవనంబు కుక్కలవారు. 5. న్యాయము. 6. ఊరి. 7. వీథి. 8. రాజగృహము. 9. సాహసించి. 10. అతిశయించెను. 11. చెవిపోఁగులతో నందములగు ...లు.

ప్రశ్నలు:—1. ఎట్లు తేనెబొట్టు నేలఁబడెను? 2. తేనెబొట్టు కారణముగా కలహము ఎట్లు ప్రారంభమై ఎట్లుసాగెను? 3. కథయొక్క నీతిం జెలుపుఁడు.

## 24. హంస కాకముల కథ.

సీ. ఒకపర్వతముమీఁద నొప్పెడు కొలనిలో
    సంచలు కొన్ని [1]యిచ్ఛానువృత్తిఁ
బగలెల్ల విహరించి భానుఁడు గ్రుంకంగఁ
    బాపాత్ములకుఁ జేరఁ బ్రాకరాని
యున్నతోన్నతమగు నొక [2]గండ శిలయందు
    రేలెల్ల సుఖలీలఁ గ్రాలుచుండు
నట్లుండఁ దద్గ్రహణాపేక్ష నొక బోయ
    [3]తెంకి పట్టరసియుఁ దేటి చూడ
గీ. లేక యరిగెను; నొకనాఁడు కాక మొకటి
ప్రొద్దు గ్రుంకిన నచటుగాఁ బోయి పోయి
ఖగ నినాదము విని వాని గదియవచ్చి
యుండుటకుఁ దావుఁగనె హంసయూథమీఁయ. ౧

గీ. అచటఁ రెట్టఁబెట్టి యరో్కదయముగాఁగఁ
దడయ కరిగె, నంత దాని రెట్ట
శిలల సంధిఁబొంద మొలచె నందొక [4]వట
భూజ ఫలములోని బీజముండి ౨

మ. అది నానాఁటికిఁ బేర్చి శాఖల [5]విహా
    యస్స్పర్శమైయుండఁగా

బదియేంట్లుం జసునంత నూడలు కడుం
బల్వారి వర్ధిల్లుచుం
గదిసెన్ వచ్చి 6యధిత్యకాతలమువం
కన్, దానఁదాఁబ్రాకి య
భ్యుదితానంది కిరాతుఁ 7డొగ్గె నురులా
భూజంబునం దెల్లెడన్.

చ. ఉరులు కుజంబునం 8గలయ
నొగ్గి నిషాదుఁడు చన్నమీఁద భా
స్కరుఁ డపరాద్రిఁజేరె జల
జాతవనంబులఁ గ్రీడమాని స
త్వరగతిమీఱి మీఁదికి 9సిత
చ్ఛదముల్ చనుదెంచియూఁగి వా
గురికలఁజిక్కె నన్నియును
గుందిమదిన్ 10బలిభుక్కృతంబుకై ౪
కేయూ. III

టీ. 1. ఇష్టప్రకారము. 2. పెద్దరాయి. 3. ఉనికిపట్టు. 4. చెట్టుపండులోని విత్తనము. 5. ఆకాశముం దాకునదై. 6. కొండ పై భాగము. 7. పన్నెను. 8. అంతటను. 9. హంసలు. 10. కాకిచేసిన పనికై.

ప్రశ్నలు:—హంసలు పగలెట్లు గడపుచుండినవి? 2. ఁజేలం దెచ్చట విశ్రమించుచుండినవి? 3. హంసలుండు కొండ పైభాగమునకు అందిచ్చు మఱ్ఱిచెట్టు ఎట్లు మొలచెను. 4. హంసలకు బంధనము ఎట్లు ప్రాప్తించెను.

## 25. కమఠగరుడ కథ.

క. అంబుధితీరంబునఁ [1]గూ
ర్మంబులు చరియించుచుండఁ, బ్రతిదినమును వా
నిం బట్టి తనకు నాహా
రంబుగఁ గొనుచుండుఁ బక్షిరా [2]జుగ్రుండై. ౧

వ. అంత నొక్కనాఁ డొక్క కూర్మముఖ్యుం డగ్గరుడి
కి ట్లనియె. ౨

మ. "[3]ఉడువీథిన్ వెసనీవువాఱు, జవస
త్త్వోత్సాహ, యంభోధిలోఁ
[4]గడవం బాఱెద; నిన్ను నేను [5]మిగులం
గాఁ జాలినట్టైన నె
న్నఁడు భక్షింపకు మమ్ము; నోడినటులై
నన్, మాకులంబెల్ల నె
ప్పుడు నాహారము గొమ్ము నీవు వినతా
పుత్త్రా, మహాధార్మికా." 3

వ. అని యొడంబఱచి యేకాంతంబున దానుం జుట్టలు నంబుధి
నొక్కొక్క రొక్కొకయెడ బహుయోజనంబుల దాఁక
నిలుచుండ నేర్పాటు గావించికొని యుండ. ౪

క. గరుడుం డవ్వలనికి స
త్వరగతిఁ గూర్మంబుఁ బిలిచి, వారిధిపై నం
బరవీథిఁ బెద్దయును ద
వ్వరుగుచు, నది [6]చిక్కనోపునని [7]చీరుటయున్. ౫

క. 'ఓ'యని పలుకుచు ముందఱఁ
దోయధిలోఁ గచ్ఛపంబు దోఁచిన, మఱియున్
వాయుగతిఁ బఱచి చీరిన,
నాయెడ నగ్రమునఁ గమఠమల్లఁ నెగసెన్. ౯

క. అందుండి మగుడఁ బఱచుచు
ముందటి యట్లట్ల పిలువ, ముందఱ ననంతం
తం దోఁచుచు, నవి పిఱుఁదులు
ముందఱఁగాఁ జేసి పక్షిముఖ్యుని గెలిచెన్. ౧౦

క. అతఁడు తనయోటమిని 7ల
జ్జితుఁడై 'మీ కెందు నెగ్గు సేయం; 8బ్రమద
సితి నిలువుఁ'డనుచుఁ బోయిన
నతిసంతోషమునఁ గచ్ఛపావళి యుండెన్. ౧౧

కేయూ. III.

టీ. 1. తాఁబేళ్లు. 2. భయంకరుఁడై. 3. ఆకాశమార్గమున. 4. దాఁటి పరుగిడుచును. 5. అతిశయింప సమర్థుఁడనైనచో. 6. వెనుకపడు నని. 7. సిగ్గునందినవాఁడై. 8. సంతోషదశలో నుండుఁడు.

ప్రశ్నలు:—1. తాఁబేళ్లు వసించుచుండిన దెచ్చట? 2. వానికిం గల్గుచుండిన యాపద యేమి? 3. తాఁబేలు గరుడునితోఁ గావించికొనిన యేర్పాటేమి? 4. తాఁబేలు గరుడు నెట్లు గెలిచెను. 5. ఓడిన గరుఁడుం డేమనెను?

## 26. కాకకారండవ కథ.

క. కోసలదేశంబున ధా
రాసనుఁడనఁగాఁగలండు రా, జతఁడు 1నయ

వ్యాసంగము ధర్మంబుల్
బాసి చరింపంగఁదొడఁగెఁ బ్రజలు 2దలంకన్. ౧

క. ఆరాజు సేయు నెగ్గులు
కారణముగ 3జనపదమునఁ గఱవగుటయు, ము
న్నారాష్ట్రంబు దమకు నా
ధారమ్ముగనుండు కాకి4తండంబెల్లన్. ౨

క. "ముంగిళ్ల 5నెండువ్రులు గా
నంగఁబడవు, గలుగు పట్టునం గావు 6ఘనం,
బెంగలి మెతుకులు చల్లుట
యుం గలుగదు మున్నవోలె నుర్విఁ 7దఱచుగన్." ౩

మ. అని కాకుల్ తమదేశముల్ విడిచి 8భు
క్త్యాకాంక్ష నెందేనియున్
జనుచోఁ, దవ్వులఁ ద్రోవ నొక్కయెడఁ గా
సారంబులో నుండి క
న్గొని మోదంబున నీరుకాకులను ప
క్షుల్ 9పక్షిజాతిత్వమా
త్రనిబద్ధంబగు బాంధవంబునన చే
రంజేరఁ బ్రార్థించుచున్, ౪

మ. జలపక్షుల్ వెలినైవఁ గ్రొవ్వుగల మ
త్స్యవ్రాతముల్ మ్రింగుచున్,
10జలజావాస సమీపకుంజ శిశిర
చ్ఛాయా ప్రదేశంబులన్

[11]లలిఁ గ్రీడించుచు, లీల న ట్లనిలచా
లం బచ్చటం బుచ్చి య
[12]బ్బలి పుష్టంబులు [13]పుష్టదేహములతోఁ
[14]బ్రహ్లాదముం జెందుచున్. ౫

క. తమ దేశంబున [15]దుర్భి
క్షము వాయుట యరసి, యఱిఁగి, చనుచుండి, విచా
రము సేయఁ దొడఁగె నప్పుడు
తమలో నన్నిచ ఖగవితానము లెల్లన్.

క. "వీరు మనకుఁ జేసిన యుప
కారం బప్పుగ నిదేలకై కొని పోవన్?
వీరిపయిం దప్పొక్కటి
యారోపింపుదము గాక! యది యెల్లఁ జెడున్."

వ. అని వాని నుద్దేశించి. ౬

చ. "నెలపది ప్రొద్దు లే మిచట
నిల్చినమాత్రన మాకు మీర లెం
గిలి సతతంబు వెట్టితిరి
కిల్బిషవర్తనులార, యక్కజల్
కలుగవె యెట్టివారికి జ
గంబున నోడల బండ్లు, బండ్ల నో
డలుఁ జనుదెంచునంట యక
టా! వినరే? యటుఁ జేయఁగూడునే?

క. మీా [16]కొఱగాములు సర్వము
మీాకుండుంగాత''మనుచు మింటఁ [17]గల గొనక
గాకా యని యఱచుచు వెసఁ
గాకులు పూర్వప్రదేశ గమనముఁ జెందెన్. ౧౦

కేయూ. III.

టీ. 1. నీతియందు ఆసక్తిని. 2. భయపడునట్లు. 3. దేశమున. 4. సమూహము. 5. ఎండఁబోసిన ధాన్యము. 6. విస్తారము. 7. అధికముగ. 8. ఆహారాశచేత. 9. పక్షిజాతియగుటమాత్రమే కారణమగు చుట్టరికము వలననే. 10. కోనేటికి దాపున పొదరింటి చల్లనినీడగల తావులలో 11. ఉత్సాహముతో. 12. కాకులు. 13. బలిసిన. 14. సంతోషము. 15. కఱవు. 16. దోషములు. 17. సంక్షోభించునట్లు.

ప్రశ్నలు:—1. కాకులకు కఱవు రాఁగతంబేమి ? 2. కారండవములు కాకుల నెట్లు సత్కరించినవి. 3. కాకుల నీచత్వముకడ కెట్లు బయలయ్యెను ?

## 27. పులియు మ్రానిపోటు పులుఁగును.

శా. [1]లీలానిర్జిత సర్వజంతువని బ
లిష్ఠన్ బేరుకొన్నట్టి శా
ర్దూలం బొక్క [2]జరన్మృగంబు నొకచో
[3]దుర్దాంతమై వ్రేసి, [4]త
త్కీలాలంబది మున్ను గ్రోలి
[5]యుదరోద్దీవ్యద్బుభుక్షానల
జ్వాలల్ తన్నలఁపంగఁ, [6]దల్చె [7]శితమాం
సంబొంది భక్షింపఁగన్. ౧

ఉ. [8]కోఱలసంధి [9]నెంపములు
గ్రుంకిన నంత దినక్రమంబునన్
మీఱిన [10]నొవ్వి భుక్తిఁగొన
నేఱక [11]యూరక గహ్వరంబునన్
గాఱెడు [12]లాలలోడఁ బులి
[13]గ్రచ్చఱి లోఁబడియుండ వ్రాసిపైఁ
గూఱినవంత నొక్క ద్రుమ
కుట్ట విహంగము దాని గాంచఁగన్.

క. "నోవిది బాపెద, విప్పఁగ
నీవదనముఁ దెఱవు"మనుచు నియమించి [14]దురం
తావిర్భా    సాహస
మై విహగంబందుఁజొచ్చి నతినిపుణతతోన్. ౩

గీ. [15]దంష్ట్రికలు పాదమునఁగొని తన్ని సంధి
నున్న యెముకను [16]చంచున నూఁదిపట్టి
పాపి కదిలిచి పెఱికి యాపక్షి యధిక
వేగమునఁ బులి [17]వాఁగడ వెడలిపోయి. ౪

క. ద్రుమశాఖనెక్కి యెముకను
నుమిసిన బులి నోరునొవ్వియుడిగి మఱిదిన
క్రమమునఁ బుండాఱిన నొ
క్క మహామృగమును వధించికొని యొకచోటన్, ౫

వ. తినుచుండ ద్రుమకుట్టంబు డాసి మాంసభాగం బడుగుడు
పులి యిట్లనియె:

గీ. కాయ [18]లుడివోయి నట్టివృక్షంబుఁ, బాఁడి
యెల్లఁ గడచిన ధేనువు, నేఱుఁ గడపి
నతఁడుఁ, గార్యము [19]దీర్చిన యతఁడు, నపుడు
గాని యాదరణీయులు గారు పిదప. ౭

మ. [20]విపినాంతర్బహుసత్త్వఘాతుకుఁడనై,
విఖ్యాతకృత్యుండనై,
కృప యొక్కింతయు లేని నావదనముం
[21]క్రీడారతిం జొచ్చినం
గుపితత్వంబున ద్రింగినం జనఁగ నీ
కుం గ్రమ్మఱంగల్గునే?
యుపకారంబన నింతకంటె మఱియుం
గొండెద్ది? యూహింపుమా." ౮

చ. [22]అనఁ జిత్తంబునఁ [23]దెంపుఁ జేసికొని, రో
షాధిష్ఠమై పొంచి, కీ
డొనరింపం దఱి వేచియుండి, విహగం
బొక్కింత [24]యాలస్య మూ
నిన శార్దూలము కన్నుఁబోఁ బొడిచి పూ
ర్ణీభూత సంతోషమై
చని భూజాగ్రముఁ బొంది యిట్లనియె హా
స్యప్రౌఢవాక్యంబులన్. ౯

క. "వింటే? మృగమా, పోయిన
కంటికి వగవకుము, రెండుకన్నులు [25]వాలియుం

గొంటయుఁ గుటకు నొకక
న్నంటకు సంతసముఁ జెందు టుచితము నీకున్." ౧౦

క. అనిపలికి యదినిజేచ్ఛం
జనుటయు, నయనంబు నొవ్వి సైఁపక పులి య
వ్వనమద్రువఁగ వాపోవుచు
దనదు కృతఘ్నత్వమునన తాహతమయ్యెన్. ౧౧

కేయూ. III

టీ. 1. క్రీడగా జయింపఁబడిన సర్వజంతువులు గలదియాని. 2. ముసలిజింకను. 3. అణపరానిదై, విజృంభించి. 4. దానినెత్తురు. 5. కడుపున రేఁగుచుండు నాఁకటి మంటలు. 6. తలంచెను. 7. కొద్దిపాటి. 8. పండ్లనడుమ. 9. ఎముకతునుక. 10. నొప్పి చేత. 11. గుహవంటినోట. 12. చొంగ. 13. బలముడిగి. 14. హెచ్చుగా నేర్పడిన. 15. కోఱలను. 16. ముక్కుతో. 17. నోరు. 18. కాచుట మానినట్టి. 19. నెఱవేర్చిన. 20. అడవిలోని పెక్కుప్రాణుల జంపువాఁడనై. 21. ఆటవలె. 22. అనిచెప్పఁగా. 23. సాహసము. 24. సోమరితనము. 25. నశింపఁజేయుటను మానుకొన్నందులకు.

ప్రశ్నలు:—1. పులికిఁగల్గిన నొవ్వి ఏమి? అదెట్లు గల్గెను. 2. ద్రుమకుట్టము పులికెట్లుపకరించెను. 3. పులి కృతఘ్నత్వమును దెలుపుఁడు. 4. ద్రుమకుట్ట మెట్లు పగఁదీర్చికొనెను?

## 28. అతిలోభము.

సీ. విజయపుర ప్రాంతవిపినాంతరమునకుఁ
బోయ యొక్కఁడు వేఁటవోయి యచట

వనహస్తిఁ గనుఁగొని [1]వల్మీకమెక్కి [2]భ
ల్లముఖఁ దుండము ద్రుంచి సమయఁజేసె;
వాని యెక్కిన పుట్టలోను వెల్వడి భుజం
గం బక్కిరాతునిఁ గఱచె; నంత
వాఁడును మొలనున్న వాఁడికుఠారంబు
గొని దాని వధియించి కూలి [3]యీల్గె

సీ. నచటి కొక్క నక్క యరుదెంచి ముదమంది
"యేనుఁ గాఱు నెలలు, మానవుండు
సప్తవాసరములు, సర్ప మేకదినంబుఁ
బోవుఁ బొమ్ము నాకు భుక్తి" యనుచు. ౧

క. "నేఁటి కివి [4]గంటి వెట్టఁగ
నేటికి? నీబోయ వింట నిడ్డనరము లీ
పూఁటఁగడపఁజాలవె? యొక
నాఁటం బ్రాణంబుసను నె నవసినమాత్రన్." ౨

క. అని తలఁచి యెక్కువెట్టిన
ధనువుఁగదిసి దాని కొమ్ముఁదన గొంతుం గ్రో
లున మోచియుండఁ జెలఁగుచు
[5]గొనయంబు నరంబు [6]లొయ్యఁగొఱుకఁ దొడంగెన్. ౩

గీ. నరము లొక్కఁడొకఁడు నానిచి కొఱకంగ
గొనయ మెల్లఁ [7]ద్రెవ్వి ధనువు కొమ్ము
మిఁడిసి గళము నాఁటి [8]పెడతల వెడలినఁ
గూసికొనుచు నక్కకూలి [9]గెడసె. ౪

కేయూ. III

టీక. 1. పుట్ట. 2. బాణముచేత. 3. చచ్చెను. 4. కొఱుకుట. 5. అల్లెత్రాడు. 6. మెల్లగా. 7. తెగి. 8. తలవెనుకటిభాగమున. 9. చచ్చెను.

ప్రశ్నలు:—1. ఏనుఁగు కిరాతుఁడు పామును మరణించిన క్రమముఁ దెలుపుఁడు. 2. పీనుంగుల జూచి నక్క ఏమి తలపోసికొనెను? 3. లోభముచే నక్క గడసినతీరుఁ దెల్పుఁడు.

## 29. నారికేళబక దురైశ్వర్య మహిమ.

గీ. పెక్కునీళులు లేనట్టి యొక్క మడుఁగు
[1]క్రేవ సున్నతమగు [2]నారికేళ మొకటి,
[3]చీకుఁగొక్కెర యొకటి వసించు నచట
[4]వారి బహుతర జలచరాహార మగుచు. ౧

క. అది యొకనాఁ డంబరమునఁ
బదివేలు బకాదివారిపక్షులు పోఁగా
"నదె నాకొలసాములు వో
యెద"రని యడ్డముగఁ బాఱి యెక్కుడు ప్రియముల్ ౨

క. కావించి "మీర లూరక
పోవుట తగ; దిల్లి భూజమున నిలుఁతు, [6]మదీ
యావాసం బది, యచటికి
రావలయును [7]బాంధవాభిరంజన మొసఁగన్.,' ౩

వ. అనుటయు నవ్విహగంబు లి ట్లనియె.

క. "ఈ [8]యూథమిది యనంతము,
నీ [9]యిర వెడలేదు నిలువ, నీ చెప్పిన యా

తోయంబుల నాహారము
మా యెఱుఁగని యదియె? యల్పమాత్రము లవియున్."

చ. అనుటయుఁ "[10]బోత్తువారి కృప
నన్నియుఁ గల్గెను; నన్నుఁ [11]ద్రోచి పో
యిరఁగుల మెల్లఁ గన్గొనఁగ.
నిప్పుడ మేను దొరంగువాఁడఁ జుం"
డనుడుఁ [12]బతత్రికోటి "మన
[13]కారడిఁ బాపముఁబొంద నేటి కి
ట్లని యితఁడాడె?" నంచుఁ జని
రందఱుఁ గొక్కెరయింటి విందులై. ౫

మ. మడువెల్లన్ [14]వెరఁజాడి మందుకయినన్
మత్స్యంబు లేకుండ న
ప్పుడ యొండొంటికి మున్న మ్రింగి విహగం
బుల్ "[15]మాపు నిల్వంగ ని
క్కడ [16]నిమ్మేమియుఁ జాల" దంచుఁ జనినం
[17]గాకెంచు పేరాఁకటన్
మడిసెన్ గొక్కెర కొన్ని ప్రొద్దులకు హీ
నంబైన దేహంబుతోన్. ౬

కేయూ. III

టీ. 1. ప్రక్కన. 2. టెంకాయచెట్టు. 3. ఒకజాతికొంగ. 4. నీటిలోని మిక్కుటమగు మీలు ఆహారముగాఁ గలదియగుచు. 5. కులము స్వాములు. 6. నా వసించుచోటు. 7. చుట్టములకు ప్రీతి వర్ధిల్లునట్లు.

8. గుంపు. 9. నిలుచుట చోటులేదు. 10. [illegible]. 11. నిరాదరించి. 12. పక్షులసమూహము. 13. వ్యర్థముగ. 14. జారుకొని. 15. రాత్రి. 16. చోటు. 17. బాధించు.

ప్రశ్నలు:—1. కొక్కెర నివసించు చుండిన దెచట? 2. అది తన కులమువారి నేమని యాహ్వానించెను. 3. అవ్విహంగంబు వచ్చిన బదులేమి? 4 ఆకొక్కెఱ వాని నెట్లు బలవంత పెట్టెను? 5. కొక్కెర ఏల మడిసెను?

## 30. లోభివణిజుఁడు. I

ఉ. ఉర్వికి భూషణంబయిన
యుజ్జయినీ నగరంబులోపలన్
[1]గుర్వనురాగమూర్తి ధన
గుప్తుఁడు, పుణ్యుఁడు వర్ధమానుఁడున్;
సర్వధన ప్రపూర్ణులయి
సఖ్యముఁబొంది వణిక్కులంబులోఁ
[2]బర్విన సెంపుతోడ [3]నన
పాయ విభూతి వహించుచుండుచున్. ౧

ఉ. "జీనపుదీవి నిన్నును [4]బ
సిండియుఁ దుల్య" మటన్న "నచ్చుటన్
[5]మానియమాడఁబోద"మని
నావల [6]వేఱొకఁడాయితంబుగా
బూని ఘటింప, నం దినుము
పూర్ణముగాఁగొని, సెట్టులిద్దఱున్

[7] ఫేనతరంగభంగురగ
భీరపయోనిధిలోన నావపై.

చ. అరుగఁగ, వర్ధమానుని మ
హోజ్వర మొందిన, "నేనచాలుదుక్,
[8] శరసిధి యాత్రకుక్ వలదు
[9] చయ్యన నేఁగుము నీవు, నీకు నే
[10] నెరపి భవర్ధనంబు నిడ
నే? [11] యెడసేయఁ దలంతునే? కటా!
మరలుము, నీవుగల్గిన స
మస్తశుభంబులు గల్గు, నెచ్చెలీ."

మ. అని వానిక్ మగిడించి, తాన చని, యి
న్నాదీవి [12] నె త్రొంటికిక్
గనకం బెత్తులు రెంటిలెక్కఁ దగినం
గై కొంచు, నాల్గోడలక్
[13] నినుపారంగ సువర్ణమెత్తుకొని, [14] పూ
ర్ణీభూత సానంద సం
జనితోద్గర్వమనస్కుఁడై మఱల యా
సాముద్రమధ్యంబునక్.

ఉ. వచ్చుచు, వర్ధమాను [15] దెస
వారల నెల్లర నీటిలోపలం
జెచ్చెరఁ ద్రోచిచంపి, యొక
[16] చెంగటి రేవున [17] వీడుఁజేరి, తా

నచ్చట [18]నాచతుష్కావగా
నర్థముఁ బాఁతి, [19]దఃప్రకాంభరం
[20]బచ్చుపడంగఁ జేసికొఁ
యాత్మనివాసముఁ బొంది, మిత్రుఁడో. ౬

శా. అన్నా యేమని చెప్పుదుం? జెజ్జెచె [21]ద
య్యాం; [22]బప్రమాదంబునన్
[23]మున్నీరెల్లనుదాఁటి యమ్మెడుపురం
బుంజేరి, యం దొక్కయిం
టన్నిండారఁగ [24]బండ మెల్ల నిడియుం
డంగం, ద్రిరాత్రంబులో
విన్నంబాంకగుసల్లుగాఁగ నెలుకల్
వేమ్రింగె నాలోహముల్."

క. అనిపలికి వీడు కొలిపిన
"ననయము సిదిబాంకు, పొసఁగ, దాత్మ ధనము వం
చనఁ గొనియె నితం"డని తన
మనమునఁ దెలిసియును వర్ధమానుం డేఁగెన్. ౭

కేయూ. III

టీ. 1. అత్యంతప్రేమయొక్క రూపమైనవాఁడు. 2. వ్యాపించిన గొప్పదనముతో. 3. పాయని సంపదగల్గి. 4. బంగారమును. 5. వర్తకమునుచేయ. 6. చెఱియొకటి. 7. నురువులు అలలు వీనితో పొంగెక్కిన లోతైన సముద్రములో. 8. ఓడప్రయాణమునకు. 9. వెంటనే. 10. నెఱవేర్చి. 11. భేదముచేయుటకు. 12. తూనిక ఒకటికి. 13. నిండు

నట్లు. 14. నిండినయానందము పొడమిన పొగరుగల మనస్సుగలవాఁడై. 15. పశువు. 16. సరిపంపు. 17. ఊరు, ఇల్లు. 18. నాలుగు ఓడల. 19. పేదతనముయొక్క యతిశయము. 20. ఆగపడునట్లు. 21. దైవము. 22. జాగ్రత్తతో. 23. సముద్రము. 24. వస్తువు.

ప్రశ్నలు:—1. చీనపుద్వీపమున ఎంతయినుమున కెంతబంగారము దొరకును? 2. అచ్చటి వ్యాపారమునకై తరలిన వర్తకమిత్రు లెవరు? 3. పోయినవాఁడు? మిగిడినవాఁడు? ఏల? 4. ధర్మగుప్తుఁడు మిత్రునకు చేసిన ద్రోహమేమి? ఎట్లు.

## 31. లోభి వణిజుఁడు. II.

క. "చెలితనమునఁ దనుఁ [1]జెఱచిన
[2]తులువంగని తొలఁగిపోక [3]తోరపుఁ బ్రియముల్
పలుకుల తీపులుఁ జూపుచుఁ
జెలిమియె వర్తించి గాక చెఱుపఁగ నగునే?" ౧

వ. అని నిశ్చయించి వర్ధమానుం [4]డనురాగియుఁబోలె ధర్మగుప్తపుత్త్రు లాలించుచుండి దాఁచి గృధ్రంబు వాతఁబడెననుచుం బలవించుచుం బ్రకటించి వెదకువారితో.

ఉ. "సెట్టికిఁ జెప్పరా నచటఁ
జేరఁగ [5]నోడెద" నన్నఁ బోయి యా
పట్టివిధంబు వా రతని
పల్కిన యట్లన చెప్పినం, [6]బులిం
గొట్టినమాడ్కి నల్గి ధన
గుప్తుఁడు "లోకములోన నెన్నఁడే

నిక్కెవి వింటివే?" యని య

హీంద్రుఁడ కవ్విధ మెల్ల జెప్పెను.

వ. వర్ధమానుండేతెంచి '[7]యవధరింపుఁ'డని రాజున కిట్లనియె.

క, "రెండొండ తులము మూషిక

కాండము భక్షించె ననుట కల్ల పలుకుగా

కుండినటు లయిన, గృధ్ర మొ

కం డొక బాలుఁగొని పోవ కదు ననుచితమే?" 3

వ. అనవుడు రాజు నవ్వి "అంత మేటి బొంకున కిది పోలు"

నంచు, ధనగుప్తు నెటిపించి, [8]వృత్త మెఱింగి.

మ. ధనమెల్లంగడు వేగఁదేఁబనిచి, [9]చే

తః ప్రీతితో వర్ధమా

నుని కొప్పించిన, "దేవ, నాధనము న

న్నుంజేరెనంజాలు" నం

చు నతండర్ధముఁ గొన్న మెచ్చుచు మహీ

శుండున్న యయ్యర్థముం

ధనగుప్తార్జిత సర్వవిత్తచయముం

దాఁగొంచు[10]ను గ్రాకృతిన్. ౪

క. ఇలుఁ బురమును దేశంబున్

వెలువడఁ ద్రోపించుటయును నెలఁతుకయును బి

డ్డలు దానుం [11]దిరిసి తినుచు

నిలపై ధనగుప్తుఁ డిట్టి యిడుమలఁ బడియెన్. ౫

కేయూ. III.

టి. 1. కీర్తిపాలుచేసిన. 2. పత్నీకుని. 3. ఎక్కువ. 4. ప్రేమగలవానివలె. 5. భయపడెదవు. 6 ప్రతికారాక్షన అది ఎట్లు కోపించునో అట్లు కోపించి. 7. వినుము. 8. జరిగినది 9. మనస్సున ఆనందముతో. 10. భయంకరరూపముతో. 11. గర్జించుచు, తిరిగి మెత్తుచు.

ప్రశ్నలు:—1. వర్ధమానుడు ధర్మగుప్తునకు ప్రత్యుపకార మేమి చేసెను ? ఎట్లు ? 2. ధర్మగుప్త వర్ధమానుల వ్యాజ్యమును రా జెట్లు తీర్మానించెను ?

## 32. బుద్ధిమాలిన కపి దొరఁ దెగనేయుట.

క. మందరపురిఁ [1]గాంతా జన
కందర్పుఁడు గలఁడు రాజు [2]ఖరవృత్తి సమా
ఖ్యం దనరి, బుద్ధిమంతులఁ
జెందఁడు, [3]సాహసుఁడు గాఁడు శిశుకాలమునన్. ౧

క. ఆనరపతి [4]యనుపుగ నొక
వానరపోతంబుఁ దెచ్చి వాత్సల్యముతోఁ
దానిఁ బెనిచి [5]యాయుధ వి
ద్యానిపుణతఁ బొందఁ జేసి యదివర్ధిలుడున్

క. [6]కంచుకము దొడిగి, [7]కుండల
చంచత్కటకాది వేష చయమిడి, శిత ఖ
డ్గాంచితరూపముతోఁ దన
[8]కంచుకియై యుండఁబనిచెఁ గదలక యెపుడున్. ౨

గీ. సుప్తుఁ డగుచుండి వానరుఁ జూచి "నన్ను
డాయవచ్చిన జీవుల వేయు ఖడ్గ

ధారఁ మునియుంగ''నని చెప్పి కూరె నిద్రఁ;
గపియుఁ బనిపూని భూపతిఁ గాచియుండ.

మ. [9]సుమనోదామము రాజు కంధరమునన్
శోభిల్ల, [10]నత్తావికై
భ్రమరం బొక్కటి మూఁగ, దానిఁగని [11] కో
పవ్యగ్రమై క్రోతి ఖ
డ్గమునన్ వేసినఁ దేఁటితోన [12]ధరణీ
కాంతావతంసంబు కం
ఠము రెండయ్యె, [13]వినీతుఁడైన పతిచే
ష్టల్ చేటు దేకుండునే. ౪

కేయూ. III

టీ. 1. స్త్రీల (చూపునకు) మన్మథుఁడు (సుందరుఁడు). 2. ఖగవృత్తి యను పేరుతో నొప్పి. 3. చదువుకొనినవాఁడు. 4. చక్కఁగా. 5. ఆయుధవిద్యలో నేర్పుగలిగించి. 6. అవిక. 7. కష్టులు మెఱుఁగాలు కడియము మొదలైన నగలసమూహము ధరించి. 8. అంతఃపురపు కావలి. 9. పూలదండ. 10. దాని పరిమళమునకై. 11. కోపముచే వేగిరపడునదై. 12. రాజశ్రేష్ఠుని కంఠము. 13. నీతిమాలినవాఁడగు.

ప్రశ్నలు:—ఖగవృత్తి ఏదేశమునకు రాజు? ఎట్టివాఁడు. 2. క్రోతి అతనియాశ్రయమున వర్ధిల్లిన విధముఁ దెలుపుఁడు. 3. బుద్ధిమాలినక్రోతి దొరం జెగ నేయుట ఎట్లు ఘటిల్లెను.

## 33. శుక కిరాతీయము.

చ. ఒక [1]పెనుగానలో నొకమ
హోన్నత భూజమునందు [2]బాల శా

బకముల [3]నసహ్యటాప్రబల
పక్షములం గలవానిఁ బోఁద్రోచి కొం
చొక [4]శుకియుండు; నుత్తరపు
కొద్దన [5]చిక్కని వెల్లఁగాగ్రినియం
వొక [6]ఫణినాయకుండు [7]గర
కోల్బణుఁడుం డొక [8]కోటరంబునన్.

క. తొల్లియు నచ్చోటన తన
పిల్లలఁగొని చన్నబోయ[9]పెద్దయుఁ గ్రూరుం
[10]డుల్లమలర నబ్భూరుహ
మల్లన నెక్కి తనకూర్చు నాత్మజయుగమున్.

క. [11]చంచులు దెఱచుచు నఱవఁగ
నించుక కృపలేకపట్టి తేర్పడఁ గని శో
కించుచు [12]రోధించుచుఁ [13]బల
వించుచు నాతనికిఁ జిలుక వెలఁది యిటులనెన్.

మ.[14] ప్రకటశ్రీయుతుఁ డొక్కఁ, డీయడవిలోఁ
[15]జాటచ్చరశ్రేణి బా
ధకు నుల్లంబుననోడి, మున్న తన[16]య
ర్థం బొక్కచోఁ డాఁచెఁ, ద
ప్పక యేఁజూచితి; నున్నదాపసిఁడిఁ జూ
పంజాలుదు; న్నన్నుఁ బు
త్రకులంగాచెద నెల్లనాఁడు నని వం
తంబాపి రక్షింపుమా.”

మ. అనినం బెన్నఢి యప్పుడే కనకపు
ట్టానందముంబొంది 'రా
నిను నమ్మింపుము' నంచు శాబకముల
[17]న్నిడంబులోఁ బెట్ట, చ
య్యన భూమీజము డిగ్గి, పోయి నియతిం
డై యొక్కచో నిల్చి, యు
ర్లను బోసుక్ వేసముట్టి నమ్మఁదగు ప
ల్కుల్ పల్కు నిర్వ్యాంచనన్.

గీ. [18]పూనుఁగాడియంత భుజగంబు లోనున్న
వెలఁగన్రాని వెడఁద తొఱట సూపి
"దీనఁ జేయి పెట్టు; లోననున్నది సవి
శేష హేమ" మనుచుఁ జిలుక చెప్పె.

ఉ. చెప్పిన వెఱ్ఱిబోయ వల
చే యటు సొన్పుడు నందుఁ గన్నులన్
నిప్పులురాలుచున్న [19]మహా
నీయ గరోజ్జ్వల భీష ణోరగం
[20]బుప్పల వాయిఁదిన్న విష
ముగ్రత నెక్కఁడు దృష్టిచీఁకటుల్
గప్పఁగఁ నోరఁబెన్నుదువు
గ్రమ్మ మృతుండయి కూలెమేదినిన్.

టీ. 1 పెద్దయడవిలో. 2. చిన్నపిల్లలు. 3. బాగుగా నేర్పడనివి యు దుర్బలము లగు రెక్కలుగలవి. 4. ఆడుచిలుక. 5. ద్ద. 6. నాగు బాము. 7. విష మెక్కువవాడు. 8. తోఅటలో. 9. మిక్కిలి. 10. మన సు సంతసింప. 11. నోళ్లు, ముక్కులు. 12. అడ్డగించుచు. 13. ఏడ్చుచు. 14. ప్రసిద్ధ ధనవంతుడు. 15. దొంగలబారు. 16. ధనమును. 17. గూటిలో. 18. ఎగ్గులుదాల్చు కొడిపాటిది. 19. ఎక్కువ విషముచే వెలుగొందు భయంకరసర్పము. 20. బొట్టన జుట్టన వ్రేళ్ల నడుమ కఱవఁగా.

ప్రశ్నలు:—1. బోయవాఁ డేమిచేసెను. 2. ఆడు చిలుక వానికేమి యానతిచ్చెను. 3. మోసపోయినబోయ చిలుక నెట్లు నమ్మించెను ? 4. వెఱ్ఱిబోయకు కడ కేమాయెను ?

## 34. అహిమూషికోపాఖ్యానము.

క. [1]క్రూరోగ్రగ్రహణ విష
హారి యనంబరఁగు నొక్కఁ [2]డతిశయ విష దు
ర్వారము నొక సర్పంబు [3]న
భీరుండై పట్టి వెదురుఁ బెట్టియఁ బెట్టెన్. ౧

గీ. పట్టిదానికి [4]నెరగాఁగ బట్టి యొక్క
మూషకమునైచి పెట్టియ మున్నువోలె
[5]గట్టిడించిన నురగంబు గఱవ రాఁగ
నెలుక బెదరక దానితో నిట్లు లనియె.

క, నాచెప్పినట్లు చేసిన
నీచెఱవిడు, నట్లుగాక నిలుపోపక నీ
వే చంపినన్ను నోరను
వైచికొనస, మాను నే [6]భవత్తు త్రెళ్లెన్ ?''

క. అనవుడు నురగము సంతస
ముస 7నాఖువుతోడ 'స్వప్నమునన్నే నను గీ
డొనరింప, నీవు నాచెలి
వనుమానముఁ దక్కి నమ్ము మానందముతోన్. ర

వ. ఇక్కరండ నిగ్రహ మెట్లుడిపెద? వుఘవు'' మనుటయు.

క. "ఏ నొక మంత్రము నీ తల
పై నుండి జపించి, జపము 9వాటించి, తగం
గా నినుఁ బిలిచెద; కదలక
నీ నయనయుగంబు మూసి నిలుమందాఁకన్." ౬

చ. అని నియమించి దాని శిర
10మంజక యెక్కి కరండ నిగ్రహం
బనువుఁగఁ జేసి యాఖువది
యప్పుడవోయె; ననంతరంబు లో
చనములు విచ్చి చూచి మది
11సంతసముఁ వగపుం దలిర్ప నా
కనుమనఁ దానునేఁగి భుజ
గం బొక బొక్కవసించి యెల్కకై. ౭

గీ. దాని బొక్కకడకుఁ దా నేఁగి 'నా ప్రాణ
సఖుఁడ, యేఁగు దెమ్ము సత్వరముగ,
నొక్కచోటనుండి యుచిత సల్లాపముల్
సేయవలె' నటంచుఁ జీరనదియు. ౮

క. 'మున్నిప్రాణము నైచివి
మిన్నక కారుణ్యక్షమాత్రి మిత్రత్వమునన్
నన్ను సహింపుమవే? నను
మిన్ని పలుకులేల? నెఱుకు నే వినుఁజేరన్.'

వ. అని సిగ్గువఱచియుంపెను. ౧౦

కేయూ. IV

టీ. 1. క్రూరసర్పములఁబట్టి విషము హరించువాఁడని ప్రసిద్ధుఁ డొకఁడు. 2. ఎక్కువవిషముచే లోఁబఱచుకొనరాని. 3. భయములేనివాఁడై. 4. ఆహారము. 5. మూఁతవెట్టిన. 6. నీయాఁకలెల్ల. 7. ఎలుకతో. 8. ఈబుట్టలోని చెఱను. 9. ముగించి. 10. భయపడక. 11. సంతోషము తనకు తప్పించుకొను దారిగల్గినందుకు, వగపు ఎలుక తప్పించుకొన్నందుకు.

ప్రశ్నలు::—1 పామునకును ఎలుకకును కరండమున సమాగమమెట్లయ్యెను? 2 ఎలుక పాము నేమిచెప్పి యొప్పించెను? 3 ఎలుక పామునుండి ఎట్లు తప్పించుకొనెను. 4 పామునకుఁగల్గిన సంతసమునకును వగపునకును గారణములేవి? 5 ఎలుక పాము నెట్లు సిగ్గుపఱచెను?

## 35. [1]పంచతంత్రావతరణము.

సీ. [2]కల్పితానల్ప దేవతాగార భూమి
[3]రత్నకీలిత ఘనసౌధరాజితంబు
నగుచు [4]నమరేంద్రనగరంబు [5]నగుచు ధాత్రిఁ
బొలుచుఁ బాటలీపుత్ర మన్ పురవరంబు. ౧

ఉ. ఆ పురమేలుచుండు [6]నమ
రాధిపతి ప్రతిమాన వైభవో

ద్దీపితుఁ డార్యసమ్మతుఁడు
ధీరుఁ డుదారుఁడు [7]బాహువిక్రమా
టోప విజృంభితుం డనఁగ
డగ్ బొగడొంది సుదర్శనుండు నా
[8]భూపకులావతంసము ప్ర
భుత్వముఁ జేరుచు బెంపు నొప్పఁగన్.

క. ఆరాజు తనకుమారులు
ధారుణిఁ బాలించు నేర్పు [9]దగిలెడు చదువుల్
నేరక యునికి, మనోవ్యథఁ
గూరి [10]నిజాత్మ౦దలంచెఁ గొలువున్న యెడన్.

క. "పెక్కండ్రు సుతులు గలరని
లెక్కించిన ఫలముగలదె లేశంబును? బెం
పెక్కిన [11]కులదీపకుఁడగు
నొక్కఁడె తనయుండుసాలు నుర్వరమీఁదన్.

గీ. [12]సంతతోన్మార్గ వర్తన సరవిఁ దిరుగు
సుతులఁ జదివించి, సద్బుద్ధిహితులఁ జేసి,
[13]వెసను నీరీతి సంపద నొసఁగఁ జాలు
నట్టి పుణ్యుండు గలఁడొకో యరసి చూడ?" ని

వ. అనిన "నాలునెలల నట్లసేయుదు"నని విష్ణుశర్మనామధే
యుండు ప్రతినఁ బూన భూపుండు సుతుల నప్పనము చేసె,
నంత విష్ణుశర్మయు.

సీ. మిత్రభేదమనంగ, మెఱయు సుహృల్లాభ
మనంగ, సంధివిగ్రహంబనంగ
లబ్ధనాశమనంగ, లలినసంప్రేక్ష్యకా
రిత్వమనంగ, బరఁగుఁ రీతి మెఱయు. ౬

చ. అమరినయట్టి తంత్రముల
నైదిటియందును [14]సర్వనీతి శా
స్త్రముల సుభాషితంబులను
[15]సారకథాబహుళంబు [16]భూవరో
త్తమ తనయానుబోధమును
ధారుణి లోకహితంబుగాఁ గ్రమ
క్రమమునఁ గావ్యరూప[17]మొన
కంబుగఁ జేసెను [18]దేవభాషలోఁ. ౭

పంచ. మిత్రభేద.

టీ. 1. పంచతంత్రమను గ్రంథము ఏర్పడినవిధము. 2. గొప్ప దేవాలయములు గలది. 3. రత్నములుదాపిన పెద్దమేడలుగలవి. 4. ఇంద్రుని పట్టణంబును. 5. పరిహసించుచు. 6. ఇంద్రునితో సరిగా వైభవములచేత ప్రకాశితుఁడు. 7. చేతుల బలాతిశయముచే చెలరేఁగినవాఁడు. 8. రాజశ్రేష్ఠుఁడు. 9. ఏర్పడునట్లు. 10. తనమనస్సులో. 11. వంశమును ప్రకాశపఱచువాఁడు. 12. ఎల్లప్పుడును పెడదారులువట్టు పద్ధతిని. 13. త్వరగా. 14. అన్ని నీతిశాస్త్రములలోనుండు నానుడులు. 15. శ్రేష్ఠకథలతో నిండినట్టిదగు. 16. రాజపుత్రుల బోధనమును. 17. చక్కఁగా. 18. సంస్కృత భాషలో. .

ప్రశ్నలు:—1. పాటలీపుత్రమను నగరమెట్టిది? 2. దాని నేలు సుదర్శనమహారా జెట్టివాఁడు? 3. అతని మనోవ్యథకుఁ గారణంబేమి?

4. కొడుకుల స్థితినిగూర్చి యతఁ డేమి తలపోసికొనెను? 5. విష్ణుశర్మ ఏమని ప్రతినపూనెను? 6. అతఁడు నేర్పిన నైదు తంత్రములు నేవి? 7. పంచతంత్ర మనుకావ్యము తొలుత ఏభాషలో రచింపఁబడెను.

### ౩౮. కోఁతి చేష్ట.

చ. ఒక నగరంబుచేరువ [1]మ
హోన్నత దేవగృహంబు [2]జీర్ణమై
[3]వికలతనొంది, యర్ధము భు
వింబడియుండఁగఁ, దానిఁజూచి[4]యు
త్సుక మతినొక్క వైశ్యుఁ "డది
తొల్లిటియందము నొందునట్లుగా
[5]నకుటిల వృత్తిఁజేయుఁ" డని
[6]యర్థమొసంగిన శిల్పకారులున్. ౧

క. ఇయ్యకొని, [7]నగరు గట్టుచు,
నయ్యెడ నొక [8]చేవ దూల మది పలకలుగా
[9]వ్రయ్యుటకు [10]నాడ నాడను
జయ్యనఁ [11]గీలములు [12]గాఁడఁ [13]జఱచిన పిదపన్.

గీ, [14]ప్రొద్దుచేరఁబడినఁ బోయిరిండ్లకు వార ;
లా సమీపతరుల నాశ్రయించి
తిరుగు మర్కటములు దేవాలయంబున
కవల నివల మెలఁగు, వాన నొకటి.

క. [15]కీలాకీర్ణ స్తంభము,
[16]లోలతమై నెక్కి [17]నెఱియలో నం[18]బదముల్

ప్రేలంగ రెండు కరములు
లీలం బెకలించి బావుచే[19]దిగియఁగన్

క. బిగువెడలి కీల యూడిన
నగచరు [18]పాదంబు లిఱుక నొప్పిం గదురన్
[20]వెగడొంది మొఱలు వెట్టుచుఁ
[21]డెగియెన్ మర్కటము, దాని [22]త్రిమ్మట వింతే. ౫

పంచ. మిత్రభేదము.

టీ. 1. మిక్కిలి గొప్పదేవాలయము. 2. శిథిలమై, 3. పగులువాఱి. 4. పూనికగల మనస్సుగలవాఁడు. 5. బాగుగా. 6. ధనము. 7. ఆలయమును. 8. గట్టి. 9. కోయుటకు. 10. ఒక్కొక్క చీలికయందును. 11. చీలలు. 12. బిగియ. 13. కొట్టిన. 14. సూర్యుఁడు క్రుంకఁగా. 15. చీలలునిండిన దూలము. 16. చాపల్యముచే. 17. పగులులో. 18. కాళ్లు. 19. లాగఁగా. 20. భయపడి 21. చచ్చెను. 22. ఆపద.

ప్రశ్నలు:—1. వైశ్యుఁడు చూచినప్పుడు మొదట దేవాలయ మెట్లుండెను? 2. వైశ్యుఁడు శిల్పుల కేమాజ్ఞాపించెను? 3. పనివాం డ్రింటికి ఎప్పుడుపోయిరి, అప్పటికి పని యెంతలోనుండెను. 4. క్రోతి ఏమిచేసెను ? ఎట్లు చచ్చెను ?

## 37. ఆషాఢభూతి.

ఉ. కలఁడిల దేవశర్మ యనఁ
గా నొక యోగి యతండు పెక్కు ది
క్కులఁ జరియించి నేర్పెసఁగఁ
గూర్చిన యర్థము [1]కంథలోపలన్

బొలుపుగఁ బోసి నైచుకొని
పోవఁగ నత్తఱిఁ గెల్లఁగాంచి ము
చ్చిలుటకు శిష్యభావమునఁ
జేరె యొకానొక దుర్జనుం డొగిన్. ౧

గీ. నామ మాషాఢభూతి నానటన మెఱసి
కదిసి భయభక్తులతనికిఁ గానఁబడఁగఁ
బరమ విశ్వాస మెసఁగంగఁ బలుకుచేసి
మెలఁగునంతటఁ దపసియు మిగుల నమ్మె.

క. ఈకంథ నాకు [2]వ్రేఁగని
చేకొన నాషాఢభూతిచే నిచ్చి యతం
డా[3]కందువ వనమధ్య త
టాకము బొలుపారఁ జూచి డాసి కడంకన్.

క. ఆచమనం బొనరింపఁగ
నాచేరువ మేషయుగళ మత్యుగ్రముగాఁ
ద్రోచియుసు మస్తకంబుల
[4]దాచియుఁ దమలోనఁ బోరఁ దా నవ్వేళన్, ౨

క. మునుపాసి వెనుక వెనుకకుఁ
జని తాఁకు [5]తగళ్లనడుమఁ జచ్చిన నక్కన్
గనుఁగొనుచు భిక్షుఁ డుండఁగ
[6]నెనయఁగ నాషాఢభూతి [7]యలమిం జనియెన్. ౩

పంచ. మిత్రభే.

టీ. 1. చింపిగుడ్డలనుగూర్చి కుట్టినబొంత. 2. భారము అని. 3. చోట. . తన్నియు. 5. మేకల. 6. అనుకూలముగా. 7. సంతోషముతో.

ప్రశ్నలు:—1. ఈకథయందు వచ్చుయోగి పేరేమి? 2. అతఁడు తనధనమును ఎందు ఉంచుకొనియుండెను? 3. దొంగ యోగియొద్దఁజేరిన విధమెట్లు? 4. ధనమెట్లు దొంగకు వశమాయెను. 5. దొంగ యోగి కగపడక జారుకొనుట కెట్లు అవకాశము గల్గెను?

## 38. [1]బకకుళీరములు.

చ. [2]గురుసరసీ తటంబునకుఁ
[3]గొక్కెరవృద్ధొకఁ డేగుదెంచి, [4]ని
ర్భర నియమవ్రతాచరణ
భావము [5]దోఁపఁగ మోమువాంచి, [6]కం
ధరముఁగుదించి, కన్నుఁగవ
[7]దార్కొనమూసిన, దానిఁజూచి య
చ్చెరువునఁ [8]గర్కటం బొకటి
చేరి [9]గతంబును జెప్ప వేఁడినన్. ౧

గీ. "అకట [10]కైవర్తు లచటికి నరుగుదెంచి
వలలు [11]నూఁతలు మొదలుగా వలయునట్టి
సాధనంబులుగొని జలజంతుకోటిఁ
[12]బారిగొనఁగవత్తు మనఁగను [13]బోసఁగవింటి." ౨

గీ. అని కుళీరంబుతో బకమపుడు పలుక
నచటి మీనంబు లన్నియు నాలకించి
"యోబకంబ, మమ్మిందఱ [14]నుద్ధరింపఁ
[15]గలిగితివి, నేఁటి యాపద [16]గడపవలయు. ౩

క. ఇంకని జలములు గలిగిన
సంకొక్క [17]యగాధ సరసి నిడెదం జాలన్,
సంకోచింపక మము నీ
[18]యంకిలి వాపుటకు నీవ యర్హుఁడ"వనినన్. ౪

ఉ. ముక్కున నొక్కటిం గఱచి
[19]మొక్కల మేమియు లేకపాఱి, తా
నొక్క శిలాతలంబుపయి
నుండి, రయంబున [20]మెక్కివచ్చి, వే
ఱొక్కటిఁ గొంచుబోయి; యది
యుందిని, క్రమ్మఱఁ బాఱుతెంచి, తా
[21]నక్కఱదీఱ మత్స్యముల
నన్నిఁటిఁజంపెను [22]గాంక్షమీఱఁగాన్. ౫

వ. అట్లు కొంపోఁబడువంతు కుళీరంబునకు రాఁగా బకంబు, ౬

క. మును మత్స్యంబుల భక్షిం
చినయెడకుం గొంచుఁ బోయి శిలపైఁ దా వా
లిన [23]మత్స్యమాంసమేదో
ఘనగంధం బెఱిఁగి యెండ్రి కడుఁ [24]జకితంబై. ౭

గీ. "పాఱి కలకాల మెవ్వాఁడు బ్రతుకునంచుఁ
[25]బ్రాణ సందేహమునఁ [26]దెగుఁ బ్రాజ్ఞుఁ డెఱిఁగి
సాహసముసేయ నాకును సమయ" మనుచు
నుఱికి కొక్కెర కంఠంబుఁ గొఱికి చంపె. ౮

పంచ. మిత్రభే.

టీ. 1. కొంగయు ఎండ్రకాయయు. 2. పెద్ద చెఱువుగట్టున. 3. ముసలికొంగ. 4. ఎక్కువ నియమములుగల వ్రతమునడపు నభినయము. 5. అగపడునన్ని. 6. మెడను ప్రక్కగజేసికొని. 7. చేరనూసిన. 8. ఎండ్రకాయ. 9. కారణము. 10. జాలరులు. 11. చేపలపట్టు సాధనవిశేషములు. 12. నాశముచేయుటకు. 13. చక్కగ. 14. కాపాడుటకై. 15. ఏర్పడితివి. 16. దాటింపవలయును. 17. లోనైన. 18. ఆపద. 19. కటువుమాట. 20. తిని. 21. ఆకలి. 22. కోరిక. 23. చేపల మాంసముయొక్కయు తలనుండు క్రొవ్వుయొక్కయు నధికమగువాసనను. 24. భయపడినదై. 25. ప్రాణాపాయమున. 26. సాహసించును.

ప్రశ్నలు:—1. ఎండ్రకాయ ఏల ఆశ్చర్యపడెను ? కొంగ నేమడిగెను ? 2. కొంగ ఏమనెను ? 3. చేపలు కొంగ నేమిప్రార్థించెను ? 4. కొంగ చేపల నెట్లు చంపెను ? 5. కొంగద్రోహమును ఎండ్రి ఎట్లు తెలిసికొనెను ? 6. ఎండ్రి కొంగ నెట్లు చంపెను ?

## 39. [1]వాయసి యుక్తి.

ఉ. వాయసదంపతుల్ తగుని
వాసముగా నొక వృక్షశాఖపై
[2]బాయక యున్నచో నునికి
పట్టునఁ [3]జేరువ పుట్ట పట్టునం
[4]దాయత రోష భీషణ మ
హాభుజగేంద్రుఁ డెఱింగి కాచి [5]వా
లాయముగాఁగఁ [6]జంపఁగ [7]జ
లంబునఁ గాకముగన్న పిల్లలన్. ౧

ఉ. [8]ఆమముమాని వాయసము
నాపుర మేలు మహీశు [9]మంది రా

రామములోనఁ గ్రుమ్మరఁగ
రాజ[10]పురంధ్రులు వచ్చి యచ్చటం
గోమల పుష్పమంజరులు
గోసి పదంపడి [11]యంబుకేళికిన్
బ్రేమదలిర్ప డిగ్గుకఱి
[12]భీతమృగేక్షణయోర్త [13]నెవ్వడిన్.

చ. తనమెడ [14]హేమసూత్రమొక
[15]దారువునం దగిలించి గ్రక్కునం
జనిన నెఱింగి వాయసము
[16]చంచుపుటంబున దాని గ్రుచ్చి యం
గనలు గనుంగొనంగ వడి
గాఁ గడుదూరముపోవ [17]కొయ్య నా
య్యానఁ జన నత్తెఱంగెఱిఁగి
[18]ధాత్రిపుఁడంతనె [19]పంచభృత్యులన్

గీ. వాయసంబును [20]నెలయించి వారు సూడఁ
గనక సూత్రంబుఁ గొనిపోయి కాలసర్ప
మున్న వల్మీక [21]వివరమం దునిచి తొలఁగ,
సరభసంబునఁ నాపుట్టఁ [22]దిరుగువాఱె, ౮

గీ. గడ్డపాఱలఁ బారల [23]బెడ్డ లొదవ
వెడఁద గుద్దళ్ల నాపుట్ట విడియ ద్రవ్వి
యందు నిద్రించుచున్న కాలాహిఁ జంపి
హారముఁ గొంచు నేగిరి యధిపుకడకు. ౯

పంచ. మిత్రభే.

టీ. 1. ఆఁడుకాకి చేసినయుపాయము. 2. ఎడసిపోక. 3. దగ్గఱనున్న. 4. ఎక్కుడ కోపముచే భయంకరమగు పెద్దపాము. 5. ఎల్లప్పుడు. 6. మాత్సర్యముతో. 7. చంపుచుండఁగా. 8. సోమరితనము. 9. ఇంటితోఁటలో. 10. స్త్రీలు. 11. జలక్రీడకు. 12. స్త్రీ యొక్క తె. 13. మిక్కిలి వడిగా. 14. బంగారుహారము. 15. కొయ్యకు. 16. దొప్పవంటి ముక్కుతో. 17. మెల్ల మెల్లగా. 18. రాజు. 19. ఆజ్ఞాపించెను, పంపెను. 20. ఆకర్షించి. 21. తోఁటలో. 22. పరివేష్టించి. 23. పెళ్లలుగా.

ప్రశ్నలు:—1. వాయసదంపతులకు గల్గుచుండిన దుఃఖమేమి? ఎవరివలన? 2. ఆడుకాకిచేసిన యుపాయ మేమి? 3. రాజభటులు పాము నేల చంపవలసి యేర్పడెను?

## 40. బుద్ధిబలము,

ఉ. [1]ఉగ్రవనంబులోన హరి
యొక్కరుఁ డెక్కడఁ వసియించి, [2]సర్వస
త్త్వగ్రహణార్థియై బహువి
ధంబుల మాంసముఁ దించునుండఁ, ద
[3]ద్వ్యగ్రతఁజూచి, జంతుతతు
లన్నియుఁగూడి, మృగేంద్రుపాద ప
ద్మాగ్రము [4]తొందరల్ గదియు
[5]నార్తిమెయిం బ్రణమిల్లి, యిట్లనున్. ౧

వ. 'దేవా, మమ్మందఱఁ జలపట్టి యొక్కనాఁటఁ జంపనేల? నిత్య మొక్కమృగంబు నీకు [6]కట్టడగాఁ బ్రీతి నంపగల' మని సమ్మతింపఁజేసి యట్ల జఱుపుచుండ నొక్క [7]శశకంబునకు వంతు రాఁగా నది తనలో నిట్లని వితర్కించె. ౨

క. బుద్ధికి నశక్యమగునని
యుద్ధాత్రిం [8]గానఁగలదె? యిదె గెలిచెద నా
బుద్ధిబలంబున సింహము
[9]నుద్ధతి యణఁగించి [10]ప్రాణయుక్తిఁ బాయన్. 3

వ. అనుచు [11]నపరాహ్ణంబు దనుక నాలసించి. ౪

క. అడుగులు [12]తొట్రుపడంగా
[13]నడ లొందిన యదియ పోలె నయ్యెడలన్
బుడమిఁబడి [14]మొగ్గి లేచుచు
[15]గడుసరియగు శశక [16]మొయ్యఁగదియం బోయెన్. ౫

వ. పోయి [17]రోషావిష్ట మృగేంద్రున కిట్లనియె.

చ. "[18]కినియక చిత్తగింపు; మొక
[19]కీడును నాదెస లేదు, నేఁడు సూ
ర్యుని యుదయంబువేళ నను
నొక్క మృగేంద్రుఁడువచ్చి యడ్డగిం
చిన "నిది యేల? [20]యేలిక భు
జింపఁగఁబోయెడి, నన్నుఁబోవ ని
మ్మనిన "వనంబు జంతునివ
హంబుల కేలిక నేన కానొకో?

క. నాకంటె నధికుఁడెవ్వఁడు?
నాకతనిం దెచ్చి చూపిన న్నిను మెత్తున్;
లేకున్న నిన్నుఁ [21]ద్రుంతుం
గా"కని యతఁ డిప్పుడనిచెఁ గడు [22]రూంకుగలిగెన్.' ౬

క. అనుపలుకు విన్నమాత్రన
తనమదిఁ [23]క్రోధానలంబు దరికొన శశకం
బున కనియె "నోరి ముందఱ
వనమున వాఁడున్నెడకు వడిఁ జను"మనుచున్.

సీ. ఆ మృగేంద్రుండు మహాజవంబునఁ బాఱి
నతని ముందఱఁ దాను నతి రయమున
నెలయించి [24]చెవులపోతెంతయు దూరంబుఁ
గొనిపోయి మున్ను చూచిన యగాధ
జలములు గల [25]కూప సన్నివేశంబున
నిలుచుండి "నీ శత్రునికి నివా
యోగ్యంబు నెలవిది, యూహించి డగ్గఱి
చూడుమా" యనఁ దొంగి చూచు నప్పు

గీ. డాత్మదేహంబు కూప జలాంతరమునఁ
గాంచి వేఱొక సింహంబుగాఁ దలంచి
కన్ను గానక మౌర్ఖ్యంబు కతన నుఱికి
యపుడ మృతిఁ బొందె దుర్బుద్ధియగుటఁ జేసి. ౧౦

పంచ. మిత్రభే.

టీ. 1. భయంకరమైన యడవిలో. 2. అన్నిజంతువులను కొనవల
యునని. 3. ఆవేగమును. 4. శిరములు తాఁకునట్లు. 5. దైన్యముతో.
6. ఏర్పాటుగా. 7. కుందేలునను. 8. చూచుటకున్నదా. 9. పొగరు.
10. చచ్చునట్లు. 11. మధ్యాహ్నము. 12. తడఁబడుచుండఁగా. 13.
భయము. 14. హోఁకరిల్లుచు. 15. నేర్పరి. 16. మెల్లఁగా. 17. రోష

ముచే ఆవేశముగొనిన. 18. కోపింపక. 19. తప్పు. 20. దారి. 21. చంపుచును. 22. క్రూరముగా. 23. కోపాగ్ని మండఁగా. 24. కుందేలు. 25. బావియొద్ద. 26. బావినీళ్ళలో.

ప్రశ్నలు:—1. సింహమువలన మృగములకు గల్గుచుండిన యాపదం దెలుపుడు. 2. మృగములు సింహముతోఁ జేసికొనిన యేర్పాటు ఏమి? 3. కుందేలు తన రాక ఆలస్యమైనందులకు సింహముతోఁ జెప్పిన కారణమేమి? 4. సింహ మెట్లు చచ్చెను?

### 41. దుర్జనుని [1]పొందు.

క. మందవిసర్పిణి యను నా
నందముతోఁ జీరపేను నరపతి శయ్యం
[2]బొందుకొని పెద్దకాలం
బెందుం బోకచటనుండు నిష్టమెలర్పన్. ౧

క. అచ్చో నొక తెలుఁగునఁ
గ్రచ్చఱ నరుదెంచి డిండిమంబను నామం
బచ్చుపడిన నల్లి మదిం
[4]బొచ్చెములే కనియె [5]యూకపుంగవుతోడన్.

ఉ. "మానకమున్న నేఁ [6]జెనఁటి
మానవరక్తముఁ ద్రావుచుందుదుం
గాని; మహీశు దేహమునఁ
గల్గిన శోణిత [7]మానఁ గానమిన్
[8]మే నెరియంగనుండి, నిను
నేఁడు గనుంగొన నిందు వచ్చితిన్

వీనికి [9]నీయ కొమ్మిటు [10]వా
దీయ మనః ప్రమదంబు చెల్లఁగన్."

వ. అను డిండిమంబుపలుకు లాకర్ణించి మందవిసర్పిణి [11]దాక్షి
ణ్యంబు కతంబున నొడంబడి ఇట్లనియె. ౪

క. "[12] వెఱవెఱఁక [13]వేగిరింపక
[14]సురపానజ పారవశ్య సుఖ సుప్తిమెయిన్
బొరసిన ధరణీకాంతుని
వర దేహంబొయ్యఁ గఱచి వలయుఁ దొలంగన్. ౫

గీ. అనిన "నల్లకాక" యని నల్లియును జెర
పీను నేకశయ్యఁ బ్రీతి నుండఁ
బేను [15]కన్ను మొఱఁగి [16]ప్రియపడి భూమీశుఁ
గదిసి సందెజాము కఱచె నల్లి. ౬

వ. కఱచి [17]వివరాంతరంబునకు లోఁగిన, దీవియఁ దెచ్చి వెద
కిన రాజానుచరులు మందవిసర్పిణిని, ౭

క. పొడగాంచి 'యిదియె కఱచెం
బుడమి ధవుని దేహ'మనుచుఁ [18]బోడ వడఁగింపన్
మడిసెను మందవిసర్పిణి;
కడు దుర్జనుపొందు హానిగాకే యుండున్? ౮

పంచ. మిత్రభే.

టీ. 1. స్నేహము. 2. సుఖించుచు. 3. శీఘ్రముగా. 4. కపటము. 5. పేనుతో. 6. నీచులగు మనుష్యుల నెత్తురు. 7. త్రాఁగ దొరకనందు చేత. 8. శరీరము పరితపించుచు ఉండి. 9. ఒప్పుకొనుము. 10. నామన

స్సునకు ఆనందముగల్గినట్లు. 11. మొగమోటముచే. 12. ఉపాయము తెలిసి. 13. త్వరపడక. 14. మద్యపానమువలని బడలికచే నొడలుమఱచి గాఢముగా నిద్రఁజెందిన. 15. మోసగించి. 16. కోర్కెతో. 17. బొక్క లోపలికి పోఁగా. 18. చంపఁగా.

ప్రశ్నలు:—1. చీరపే నుండినచోటు ? 2. నల్లి పేనుంగోరిన దేమి ? 3. పేను నల్లికిఁజెప్పిన వెఱవు ఏది ? 4. పేను చచ్చుటకుఁ గారణ మేమి ? 5. ఈకథయొక్క నీతియేమి ?

## 42. నమ్మి చెడుట.

చ. అతుల మహోగ్ర కాననము
నందు మదోత్కట నామసింహ [1]ము
ద్ధతిఁ జరియించు, దానికిఁ [2]బ్ర
ధానులు కాకము [3]పుండరీకమున్
మతిగల జంబుకంబును గ్ర
మంబునఁ బంపొనరించుచుండె, యొ
క్కతఱి నరణ్యదేశమునఁ
గాంచిరి [4]యుష్ట్రము, వల్కిరిట్టులన్. ౧

చ. "వెఱవక విశ్వసింపుమము,
[5]వింతగఁజూడక, వచ్చితేని, ని
న్నెఱుకపడన్ మృగేంద్రునకు
నింపుగఁజెప్పి [6]తదీయభక్తికిన్
గుఱుతుగ నిన్నుఁజేసి, మన
కోరికలెల్ల నతండు దీర్పఁగా,

[7]నెఱసిన వేడ్క, నల్వురము
నెమ్మది నుండుద మెల్ల కాలముఁ.' ౭

వ. అని యట్లు సేయ నుష్ట్రంబు నా గోమాయు పుండరీక కాకంబులం గలిసి యతి స్నేహంబునఁ బెద్ద కాలం బున్న సమయంబున నొక్కనాఁడు మదోత్కటుండు నిజామాత్యుల కిట్టు లనియె.

ఉ. "[8]కల్యమునందు భక్ష్యమును
గానక మేను కృశించె, రోగ దౌ
ర్బల్యము నాకుఁ గల్గుటను,
[9]భద్రగజేంద్ర శిరఃపలాద శౌ
హల్యము లేమి [10]నుద్ధతికి
నోపక [11]చిక్కితిఁ; గాన దేహ [12]నై
కల్యము మానుకై వడి సు
ఖంబగు [13]పథ్యముఁ దెచ్చి పెట్టుఁడీ." ౮

వ. అనిన వారును నలుదిక్కులం జెదరి, వెదకి, కానక, యుష్ట్రంబు వెలిగా, గడమ మువ్వురు మగిడి చేని కిట్లనిరి:- ౯

గీ. అధిప! గిరి గహ్వరముల కుగ్రాటవులకు
నరిగి [14]యామిష మబ్బక తిరిగి తిరిగి
[15]చిక్కితిమి; నీవు [16]చిక్కి నశింప నేల ?
విన్నవించెద మే మొక [17]వెరవు, వినుము.

గీ. [18]కథనకుండు మిమ్ముఁ గార్యార్థియై వచ్చి
కొలిచినాఁడు గాని, నిలువ లేదు;
వాఁడు నీకు మాకు వలయు భోజనముగుఁ
[19]బ్రియము వదలి మట్టుపెట్టి తేని.'' ౭

వ. అని లోట్టియుయురాఁగాఁ దత్సమక్షంబున గాక జంబుక శార్దూలంబులు క్రమంబున దమ్ము ఆహారముగ నర్పించు కొన్న [20]నొల్లకుండి కథనకుం డర్పించుకొనుఁడు మృగేంద్రుఁడు. ౮

క. వడి నుఱికి లొట్టిపిట్టను
మెడఁగోఱల గఱచి పట్టి మేదిని మీఁదన్
బడఁ దిగిచి చంపి తినె నటు
[21]లొడఁగూడఁగ గాకి పులియు గోమాయువునున్. ౯

పంచ మిత్రభేదము.

టీ. 1. గర్వముతో. 2.మంత్రులు. 3. పులియు. 4. ఒంటె. 5.ఆశ్చర్యపడి. 6. మృగేంద్రభక్తులలో ఆదర్శప్రాయునిగాఁజేసి. 7. అతిశయించిన యానందముతో. 8. వేఁగుజామున. 9. శ్రేష్ఠమైన యేనుఁగుకుంభస్థల మందలి పాలసు ఎక్కువగాలేనందున. 10. ఉత్సహింపశక్తిలేక. 11, 15. సంకటపడితిని. 12. తఱుఁగుదల. 13. హితమగు నన్నము. 14. మాంసము. 16. కృశించి. 17. ఉపాయము. 18. ఒంటె. 19. ప్రేమ. 20. ఇష్టపడకుండ. 21. కలసిరాఁగా.

ప్రశ్నలు:—1. ఈ కథయందలి సింహమునకుఁ బేరేమి? 2. అతని మంత్రు లెవరు? 3. కాక వ్యాఘ్ర గోమాయువులు ఒంటెను ఏమి చెప్పి కలిపికొనిరి. 4. సింహ మేల యాహారముదేఱ మంత్రులనంపెను?

5. కాక వ్యాఘ్ర గోమాయు సింహంబులు లొట్టియకు ద్రోహము గావించిన తెఱఁగును వివరింపుఁడు.

## 43. [1]హంసకచ్ఛపీయము.

క. కంబుగ్రీవుండను పే
రంబరఁగిన కచ్ఛపము [2]నిరంతరసౌఖ్యా-
డంబరమగు నొకకొలనం
[3]బంబిన సంతోషమెసఁగఁబాయకయుండెన్. ౧

గీ. అందు వికట సంకటాఖ్య హంసయుగంబు
నిలిచి కచ్ఛపంబుఁ గలిసి తిరుగు;
వానలేక చాల [4]వఱపైనఁ గూర్మంబుఁ
గాంచి యప్పుడనియె నంచనోయి. ౨

క. "[5]మానససరోవరాంతర
మానిత జలపానకేళి మగ్నుల మైనం
గాని మన బడలికలు మఱి
మానంగా నేఱు మించటి మడుఁగులనీళ్లన్" ౩

వ. అంత "నన్నుం దోడుకొని పొ"ండన్న కమఠంబు నొక్క కాష్ఠమధ్యంబుఁ గఱవఁబనిచి [6]కడలు రెండును దాము ముక్కునఁ గఱచిపట్టి రాయంచ [7]లుడుపీథి నెగసి పఱవఁగా. ౪

మ. అతిదూరంబుగఁ గచ్ఛపంబుఁ గొనుచున్
హంసంబులిట్లేగఁగా

క్షితిపై నొక్కపురంబు మానవులు త
చ్చిత్రంబు నీక్షించుచున్
[8]జతురోక్తుల్ వెరయంగఁ జెప్పఁగ నరా
[9]సంరావమాలించి స
మ్మతియై యాత్మఁదలంపకే కపుకు కహా
ర్మంబంచలన్ జూచుచున్. ౫

క. ఇదియేమి కలకలంబన
వదనము కాష్ఠంబువదలి వసుధం బడెఁ; [10]న
య్యెద నెఱిఁగి [11]హంసలుబ్ధకు
[12]లదయతఁగొని చనిరి దాని బొంగుచు మదిలోన్. ౬

పంచ. మిత్రభే.

టీ. 1. హంసలయొక్కయు తాఁబేలుయొక్కయు కథ. 2. ఎడతెగని సుఖాతిశయము గలదగు. 3. ఎక్కువ. 4. అనావృష్టి. 5. మానససరస్సులోని శ్రేష్ఠజలములం ద్రాఁగుటలోను అందుఁ గ్రీడించుటలోను మగ్నులమైన నేతప్ప. 6. కొసలు. 7. ఆకాశమున. 8. చమత్కారంపు మాటలు. 9. కలకలము. 10. ఆసమయము కనిపట్టి. 11. మాంసాపేక్షులు. 12. క్రూరత్వముతో.

ప్రశ్నలు:—1. మిత్రుల హంసకమఠంబుల నామంబులేవి? 2. అంచలేల మానససరస్సుకు పోఁగోరెను. 3. అవి ఎట్లు తాఁబేటిం గొని చనినవి. 4. తుదకు తాఁబే లేమాయెను? ఎట్లు.

## 41. టిట్టిభదంపతులు.

ఉ. [1]టిట్టిభదంపతుల్ [2]సుఖపటిష్ఠత [3]వార్ధితరంగ జాల సం
ఘట్టితభూమి జాతముల కందువగూఁట వసించియున్నచో

నట్టియెడం గులాంగన త్తృవిభుం గనుగొంచు వేఁడె "నీ
పట్టునఁగావరా యుదధిపా లిటుగాక సుఖింపఁబిల్లలన్?" ౧

వ. అనిన నాత్రిత్తు వి ట్లనియె.

గీ. "ఈసముద్రుండు నాతోడ నెట్లు వైర
పడ సమర్థుండు? తెలియకపలికి, తబల;
సంశయము మాను, మిట్టట్టు జరుగు పనికి"
యనిన మాటల నాకాంత యడలుమానె. 3

వ. తత్ ప్రతిజ్ఞాభంగము సేయంగలవాఁడై సముద్రుండు వానియండంబుల నపహరించిన పరిదేవించు ప్రాణవల్లభ నూఱార్చి టిట్టిభవిభుం డి ట్లనియె. ౪

చ. "వెఱవకు కాంత, నన్ను 'నవి
వేకియితం'డని నీవు చూడ, కే
డ్తెల భువనప్రపంచమునఁ
ద్రిమ్మరు పక్షులఁగూర్చి నీవు ని
వ్వెఱపడఁ బక్షివల్లభుని
విష్ణునిదెచ్చి యపత్య మిప్పుడే
నెఱయఁగఁదెచ్చి యిచ్చెద న
నింద్యచరిత్ర" యటంచు నాతఁడున్.

గీ. పక్షులెల్ల విహంగపతికి మొ్రిక్కి
జలధి టిట్టిభములకును జలముతోడఁ

గీడుచేసిన పని యెఱిఁగింప నెఱిఁగి
యమ్మహాత్ముండు పక్షుల [10]కథయు మొసఁగ

వ. వైకుంఠంబునకుం జని పుండరీకాక్షుం బ్రసన్నుం జేసి [11]యర్ణవదుర్ణయంబు విన్నవించిన.

గీ. గరుడవాహనారూఢుండై [12]కైటభారి
రయముతో వచ్చి యుదధితీరమున నిల్చి
యండజంబులు మ్రొక్కిన నభయ మొసఁగి
[13]జలధరధ్వనిఁ గేలెత్తి జలధిఁబిలిచె. ౮

చ. పిలిచిన నంబుధీశ్వరుఁడు
పెంపెసలార ముకుందు ముంద రా
చలధరుఁగాంచి సద్వినయ
సంభ్రమ మొప్పఁగఁ [14]జాఁగి మ్రొక్కినన్
జలరుహలోచనుండనియెఁ
"జయ్యన నీవు హరించినట్టి పి
ల్లలఁగొని రమ్ము, పక్షులవి
లాపము మాన్పుము నేఁడు మాకుఁగన్."

క. అనినన్ జలధి 'ప్రసాదం'
బని వేగమ తెచ్చి టిట్టిభాండంబుల న
వ్వనజోదరు ముందట నుం
చినఁగైకొని టిట్టికిచ్చె శ్రీపతి పేర్మిన్. ౧౦

పంచ. మిత్రభే.

టి. 1. లకుముకిపిట్ట దంపతులు. 2. ఎక్కువసౌఖ్యముతో. 3. సముద్రంపు టలల సమూహముచే కొట్టుబడు చెట్టుప్రదేశమున గూటిలో. 4. టిట్టిభము. 5. భయము. 6. ఏడ్చు. 7. విజృంభించి. 8. సంతతిని. 9. పూర్తిగా. 10. భయముమాన్పి. 11. సముద్రుని నేరమును. 12. విష్ణువు. 13. ఉఱుమువంటి కంఠస్వరముతో. 14. సాఁగిలబడి.

ప్రశ్నలు:—1. టిట్టిభములకు సముద్రుఁడు చేయుచుండిన యపకారమేమి? 2. టిట్టిభుఁడు భార్య నేమనియూరార్చెను. 3. టిట్టిభుని ప్రతిజ్ఞను ముద్రుఁ డెట్లు వ్యక్తపఱచెను? 4. గరుత్మంతుఁ డెట్లు పక్షులఁ బ్రోచెను?

## 45. [1]బక మౌర్ఖ్యము.

మ. ఒక [2]కాసారతటంబునందు [3]నౌరపై
యున్నట్టి వృక్షంబుపై
బకయుగ్మంబువసింప భార్య పురుషుం
బ్రార్థించె "నోనాథ, [4]య
ర్భకరాజిం దినిపోవుఁ గ్రిందఁగల స
ర్పం [5]బేపుమై, నింక [6]న
చ్చిక నేతెంచుఁ బ్రసూతికాలమును వ
చ్చెం, గార్య మెట్లుండునో? ౧

వ. అనిన నొక్క [7]కుళీరంబు "మీకుం దగిన యుపాయంబు చెప్పెద, వినుం డని వాని కిట్లనియె.

గీ. "[8]నకుల వివరంబునందుండి నాగ విభుని
యునికి దాఁకను మీనంబు నొకటి నొకటి

వైచుకొని పోవ, నాముంగిస యసఁ దినుచుఁ
బాముఁ జంపును, దీని కుపాయ మిదియె." ౨

అని కుళీరంబు చెప్పినఁ గొక్కెర యవ్విధం బాచరింప నకులం బమ్మత్స్యంబులఁ దినుచుఁ జని యని కృష్ణసర్పం బును ఖండించి వృక్షంబెక్కి బకదంపతుల యపత్యంబులను భక్షించెం గావున.

క. తన బ్రతుకుకొఱకు నొరునిం
గనికర మొక్కింతలేక కాఱించిన య
మ్మనుజుఁడు గనఁ [9]దున్నత శో
భనముల నెన్నండు మూర్ఖ బకముం బోలెన్. 3

పంచ. మిత్ర భే.

టీ. 1. కొంగయొక్క మూర్ఖత్వము. 2. ఒక చెరువుగట్టున. 3. అందమై. 4. బిడ్డలసమూహమును. 5. గర్వముతో. 6. తప్పక. 7. ఎండ్రకాయ. 8. ముంగిసయుండు తొఱ్ఱనుండి. 9. గొప్పమేళ్లను.

ప్రశ్నలు:—1. పాము కొంగపిల్లల నేమిచేయుచుండెను ? 2. ఎండ్రి కొంగలకు కఱపిన యుపాయమేమి? 3. ఆ యుపాయమువలన గలిగిన యపాయ మేమి ?

## 46. సుబుద్ధి దుష్టబుద్ధులు.

ఉ. [1]పొందుగఁ దుష్టబుద్ధియు సు
బుద్ధియు [2]నాఁగ [3]వణిక్కుమారు లా
నందముతోఁ జరింప, నొక
నాఁ డొకచోట సుబుద్ధిగాంచె నెం

పొందవ [4]సావారిటంకముల
నుంచిన కాంచన కుంభ, మట్టి యా
[5]కుందన మొక్కచోట నిడి
[6]కూర్చిన కోమటిఁజేరి ప్పినక్.
... చెప్ప, వారిదువురు శీఘ్రంబ చని, రాత్రి
గొనివచ్చి, తమ పురంబునకు వెలిని
వృక్షమూలంబున వెలయ నిక్షేపించి,
వెచ్చంబునకు మున్ను పుచ్చినట్టి
[7]నిష్కంబు లిరువురు [8]నెఱయ విభాగించు
కొని తమ యిండ్ల కింపొనరఁ బోయి
ప్రకటిత స్నేహసంపదఁబొంది యిరువురు
తొలఁగక మెలఁగంగ, దుష్టబుద్ధి
గీ. తనదు చిత్తంబునందుఁ దద్ధనముఁ దాన
యపహరించిన నంతయు నబ్బు ననుచుఁ
దలఁచి యొక్కనాఁ డొంటిగాఁ దాన యరిగి
[9]పేర్చి యాబిందె వేగంబె పెల్లగించి.
క. కొని తెచ్చి యతి రహస్యం
బున నొకచోఁ బాఁతి దుష్టబుద్ధి సుబుద్ధిం
గని పలికె "నాఁడు దాఁచిన
ధనమిండ్లకుఁ దేక, మనకుఁ దడయఁగ నేలా?"
వ. అని పలుక నిరువురుఁజని తరుమూలంబునఁ [10]ద్రొచ్చి
చూచి యొండొరులమీఁద నవిశ్వాసంబునొంది మహీశ్వరు

సమ్ముఖంబున నత్తెఱ    ఁగించి; రంపు దుష్టబుద్ధి యి
ట్లనియె. ౪

మత్త.—

"పూని దీనివిచారమేల? సుబుద్ధి తానె హరించె; మీ
యాన, దానికి సాక్షి యచ్చట [11]సంచితం బగు వృక్షమే,
కాని మానిసిఁ జెప్పఁ, జెప్పినఁ [12]గల్ల పెట్టుఁడు నన్ను, స
న్మానితాత్మకులార మీరలు నాకు దిక్కని మ్రొక్కుచున్.

వ. తనతండ్రిం జెట్టుతొఱ్ఱయందు దాఁచి యతనిచే స్వర్ణహారి సుబుద్ధియ యని పల్కించె, నంతఁ గోపోద్దీపితుండై సుబుద్ధి తరుకోటరంబున ననలంబు జొన్ప.

క. అనల జ్వాలాజాలము
తన దేహము చుట్టుముట్టఁ దల్లడపడుచున్
మునుకొని మొఱ్ఱలు వెట్టుచు
జనములపై దుష్టబుద్ధి జనకుండుఱికెన్,

గీ. పడిన సెట్టిఁ జూచి    ఁబడి ధర్మాధి
కారు లెల్ల భ్రమసి కదిసి యడుగ
"సుతుఁడు దుష్టబుద్ధి సుండు నన్నిటువంటి
[13]యుదుకుచేసె" ననుచు నుసులు విడిచె. ౫

వ మహీకాంతుం డత్తెఱంగంతయుం దెలిసి దుష్టబుద్ధిం గొఱతవేయంబంచి వాని సర్వస్వంబునుం జూఱకొనియెన్.

పంచ. మిత్రభే.

టీ. 1. స్నేహముతో. 2. అను. 3. వైశ్యకుమారులు. 4. బంగారు నాణెములు. 5. బంగారము. 6. ప్రియుఁడగు. 7. నాణెములు. 8. న్యాయ్యముగా. 9. విజృంభించి. 10. త్రవ్వి. 11. పూజితమగు. 12. నమ్మకుఁడు. 13. పరితపింపఁజేసె.

ప్రశ్నలు:—1. సుబుద్ధియు దుష్టబుద్ధియు నెవరు? 2. వారిలో నెవరికి బంగారము దొరకెను, అతఁ డేమిచేసెను? 3. దుష్టబుద్ధి గావించిన ద్రోహ మేమి? 4. ధననాశము సుబుద్ధి కెట్లు తెలిసెను? 5. దుష్టబుద్ధి న్యాయాధిపతితో నేమనెను? 6. దుష్టబుద్ధి యెట్లు చెట్టుచేత మాటాడించెను? 7. దుష్టబుద్ధిమోసమును సుబుద్ధి యెట్లు బయల్పఱచెను? 8. కడకు దుష్టబుద్ధి కేమాయెను?

## 47. [1]ఘూకాపాదిత కాక ప్రళయము.

ఉ. మెండగుశాఖలన్ ధరయు
మిన్నును దిక్కులు నాక్రమించి [2]మా
ర్తండ మరీచిజాలములఁ
దాఁకనినీయని [3]యాకుజొంపముల్
నిండి [4]మహాండజంబులకుఁ
నిల్కడగా నొక కానలోనఁ బ్ర
హ్మాండము మట్టియొక్క [5]వట
మద్భుతమై పెనుపొందు నెంతయున్. ౧

ఉ. ఆమహనీయభూరుహము
నం దనిశంబు ననేక బాంధవ
స్తోమము దన్నుఁ గౌతుకము
తోఁ గొలువంగను మేఘవర్ణుడన్

నామముదాల్చి ప్రాభవము
నం బెంపొంది వసించు
స్వామి [7]విపక్ష పక్షికుల
సంహరణ ప్రవణాంతరంగుఁడై. ౨

ఉ. వేఱొకవంకఁ గొండగుహ
[8]వేశ్మముఁగాఁగ [9]నులూకభర్తదన్
మీఱిన యట్టి మంత్రులఁగ
మిం గలవాఁ డుపమర్దనాముఁ డా
[10]యీఱిణమునందు రేలు దమ
యిచ్చల మేసి దివంబులాగుహన్
దూఱి వసించుచుండె నొక
[11]మష్టకయాత్మకు సొంపు పెంపఁగన్. ౩

వ. అంత నొక్కనాఁటి నిశాసమయంబునఁ దనకుఁగల మంత్రులం బిలిచి వారలతో ని ట్లనియె. ౪

క. "మహిఁ గాకులకును మనకును
సహజంబగు వైరమగుటఁ, జంపఁగఁ దగు; నా
గ్రహమధిక మెపుడు నాకుం,
బ్రహరింతు [12]నిశాంధవృత్తిఁ బరఁగెడువానిన్. ౫

క. మీరును మీమీసేనలఁ
[13]దోరముగాఁ గూర్చుకొనుచుఁ దోడ్తెం"డనినన్
వారట్లు సేయ ఘూకము
లారాతిరి నడుచుచుండె యన్నియుఁ [14]ద్రుటిలోన్.

వ. కాకంబులున్నట్టి [15]కందువ సేరి.

గీ. ఉఱికి కొన్నిటి కంఠముల్ నఱికి వైచె
[16]రేంచి కొన్నిటి వక్షంబు [17]లాగి వైచె
కదిసికొన్నిటిపార్శ్వముల్ [18]చదిపి వైచె
గ్రుచ్చి కొన్నిటికడుపులు [19]వ్రచ్చి వైచె. ౮

వ. మఱియు ననేక ప్రకారంబుల నయ్యులూకంబులు కాకంబులకు [20]మహాప్రళయం [21]బాపాదించి సంతసిల్లి తమయంత వట్టునుంగూడుకొని నిజనివాసంబులకుం జనియె. ౯

పంచ. సంధి.

టీ. 1. గూబలు కాకులకు గావించిన నాశనము. 2. సూర్యకిరణ సమూహముల ప్రవేశింపనీయని. 3. ఆకులగుబురుతో. 4. గొప్పపక్షులకు నునికిపట్టయి. 5. మఱ్ఱిచెట్టు. 6. ప్రభుత్వమున అతిశయించి. 7. శత్రువులగు పక్షులకులములను చంపుటలో ఆతురమగు మనస్సుగలవాఁడై. 8. ఇల్లుగా. 9. గూబలరాజు. 10. పొదరిండ్లలో. 11. చెడ్డయాలోచన మనసు కెక్కువ నచ్చఁగా. 12. రాత్రులు కన్నుగానక ఉండువానిని. 13. ఎక్కువగా. 14. క్షణములో. 15. ప్రదేశము. 16. విజృంభించి. 17. పెఱికి. 18. చిదుకఁగొట్టి. 19. చీల్చి. 20. గొప్పవినాశము. 21. కల్గించి.

ప్రశ్నలు:—1. కాకులు కాపురమున్నదెచట, వాని రాజెవరు? 2. గూఁబలు వసించునదెచట? వాని ప్రభువెవఁడు? 3. గూబరాజు మంత్రులతో నేమాలోచించెను. 4. గూబలు కాకులను నశింపఁజేసిన దెట్లు?

## 48. శశవిజయము.

గీ. [1]సలిలతత్వంబు వనరుహాసనుఁడు మాన్పఁ
బోలునో కాక యింతప్రోఁ [2]బొడవడంగ

వనఁగ సకలజంతు భయావహంబుగాఁగ
దూషితముగ [3]ననావృష్టి దోషమయ్యె. ౧

వ. ఒక్కయెడ [4]మహాగహనంబునంగల గజంబు లన్నియుం గూడుకొని దిక్కులకేఁగి [5]జలమరసి చంద్రసరసింగాంచి వచ్చి తమ యేలికతో "మనకుండ మంచిచోటబ్బె నేఁడు వేఁగవిచ్చేయుఁ" డనుటయు మదద్విరదవిభుఁడు సంరంభ విజృంభితుఁడై కదలె. ౨

గీ. అట్టి సంరంభగమనంబునందు నందుఁ
గల [6]శశంబులు తత్పాదఘట్టనమున
మ్రంది మృతిఁబొందులయుఁ మంత్రిఁజూచి శశక
నాయకుండు శిలీముఖ నాముఁడనియె. 3

గీ. "నిన్నుఁ గడచినట్టి నిజమైనహితుఁడును
నీతియుతుఁడుఁ గలఁడె? నిర్మలాత్మ,
జయము నాకుఁగలుగు సమధికోపాయంబు
తలఁపు నీవు" నవఁగ నతఁడు నేఁగి.

గీ. కాంచి యేన్గువిభుని గదియంగ నేలంచుఁ
జెంతనున్న శైలశిఖర మెక్కి
నిక్కి "యోగజేంద్ర, నేమమె?" నీకన్న
దొండమెత్తి చూచెఁ గొండమీఁదు. ౫

వ. చూచి గజేంద్రుం "డోరి నీవెవ్వండ" వనిన నతఁడు "ఏను విజయుండఁ [8]గైరవాప్తు దూతను. ౬

క. ఆకొలను చంద్రు పేరన్
[9]ప్రాకటముగ మున్ను గలిగె [10]బహుపక్షికుల
వ్యాకీర్ణ తటసమీపా
నోకహసురసిద్ధసాధ్య నుతిపాత్రంబై.

క. ఇందులకుం గావలిగాఁ
బొందుగ నమ్మునిచినాఁడు బుధజనకుఁడు; మ
మ్మిందఱు మట్టి చంపితి,
ఇందునితో వైరపడగ నెంతటివారల్? ౯

క. ఈయపరాధంబునకీ
రేయి కళానిధికి మ్రొక్కి ప్రియమున ననుపన్
బోయెదవుగాక" యనుటయు
నాయేనుఁగు నీయకొనియె నట్టులె సేయన్.

క. గజయూథంబులు గొలువఁగ
గజనాథుఁడు గదలె తీవ్రగమనంబున; న
వ్విజయముఁ గైకొని చెలఁగుచు
విజయుండను శశకమేఁగె విభుఁ డున్నెడకున్. ౧౦

పంచ. సంధి.

టీ. 1. నీరు అనుపదార్థము. 2. అగపడకపోవు. 3. వానయే లేకపోవుట. 4. పెద్దయడవిలో. 5. నీరువెదకి. 6. కుందేళ్లు. 7. మించినట్టి. 8. చంద్రుని రాయబారిని. 9. ప్రసిద్ధముగ. 10. పెక్కుపక్షుల గుములచే వ్యాప్తములగు గట్టుదాఁపుచెట్లచే సురులకును సిద్ధులకును సాధ్యులకును పొగడఁదగినదై.

ప్రశ్నలు:—1. ఏనుఁగులు చంద్రసరసికి రాఁగతంజేమి? 2. ఏన్గుల వలన కుందేళ్లకుఁగల్గిన యాపద ఏమి? 3. శిలీముఖుఁ డెవరు? 4. విజయుఁ డెవరు? 5. శిలీముఖుఁడు విజయు నేమని పొగడెను? 6. విజయుఁడు ఏన్గుల నెట్లు పాపెను?

## 49. మిథ్యామనోరాజ్యము.

సీ. పరఁగ విద్యాభ్యాసపరుఁ డొక్కభూసురుం
[1]డనువుగా [2]మహాశయంబున భుజించి
చను దేఱ నొండొక సదనంబు విప్రుండు
పితరులకై వేలపిండి యిడినఁ
గైకొని తానొక్కఘటము సంపాదించి
పొందుగా నాశిసక్తు వందుఁ బోసి
చేతి కందెడు నట్టిచేరువ నా కుంభ
మెలమితోఁ బ్రీతుఁడై యచటఁబెట్టి
గీ. [4]సుమధు రోత్కృష్ట భోజనోత్సవము కతన
నతఁడు సుఖసుప్తినొందెడు నవసరమున
నంతకంతకుఁ దట్టమై యలమఁ బడిన
[5]గురుమనోరథమంతయుఁ గోరుచుండి. ౧

వ. ఇట్లని తలపోయఁ దొడంగె. ౨

చ. "కఱ వరుదెంచినన్ [6]ఘటముఁ
గర్భమునంగల సక్తువంతయున్
దఱఁగక యమ్మి, మేఁకఁ గొనఁ
దానికిఁ బిల్లలు రెండుగల్గు; న

మ్మ లకలు రెంటికిం గలుగు
మానుగ దూడలు నాల్గు వాని కి
ట్లజిముజినెన్న నెన్మిదిఁ, బ
దాఱును, ముప్పదిరెండుఁబుట్టఁగన్. 3

వ. క్రమక్రమవృద్ధిని భాగంబుల నమ్మి యసంఖ్యాత గోధనం
బులు సంపాదించి. ౪

గీ. రాజుచేత మహాగ్రహారములు వడసి
గుళ్లుఁ జెఱువులు వనములు గోపురములు
సౌధములు మల్లెసాలలుఁ [7]జప్పరములు
సంతిపురములు లోనుగా నమరఁజేసి. ౫

గీ. [8]రత్నభూషణాలంకృత రమ్యగాత్రు
ననుదినంబును [9]వాహ్యాళి కరుగు నన్నుఁ
జూచి బంధుజనం బెదఁజోద్యపడుచు
నెలమిఁ దమ కన్నియను నాకు [10]నీయఁ బడసి. ౬

గీ. పెక్కు నోములు నోమంగ [11]భీత హరిణ
నేత్ర గర్భంబు ధరియించి పుత్త్రుఁ గాంచ
వాఁడు నత్యంత సుకుమార వైభవమునఁ
బేరు సోమశర్మయనంగఁ బెరుగుచుండ. ౭

చ. 'పని తమకంబునన్ గృహిణి
బాలకు నెత్తకయుండు దెట్లునీ?'
వని [12]భ్రుకుటీవికార వద
నాంబుజుఁడై వసుధామరుండు తాఁ

దనకర మొప్పఁజూచి ఘన
దండము గైకొని వ్రేయ దండిపె
ట్టునకలశంబు భగ్నమగు
నుం దెలివొందె యనంతరంబునన్

వ. [13]మనోరాజ్యంబు మిథ్య యగుటకుఁ జింతాక్రాంతుండై యూరకుండె.

పంచ. అసం.

టీ. 1. సుఖముగా. 2. భాద్రపదమాస కృష్ణపక్షమునఁజేయు పితృశ్రాద్ధమునందు. 3.     4. రుచిగల మేలైనవిం దనుభవించుటచే. 5. గొప్పకోరిక. 6. కుండలోనున్న. 7. చదరపు (పందిరి) చట్టములు. 8. రత్నాలనగలతో సింగారించుకొన్న యందమగు దేహముగలవాఁడనగు. 9. స్వారి. 10. ఇయ్యఁగా పెండ్లాడి. 11. పత్ని. 12. బొమముడిచే మాఱుపాటునందిన ముఖపద్మముగలవాఁడై. 13. తలపోసికొన్న సౌఖ్యము అసత్యమగుటకు.

ప్రశ్నలు:—1. బ్రాహ్మణునకు పేలపిండి ఎట్లు లభించెను? 2. అతఁడు దాని నెచట భద్రపఱచుకొనెను? 3. అతనికి పగలే గాఢనిద్ర రాగతం బేమి? 4. కలలో నతఁడు భావించుకొనినవెల్ల ఏవి? 5. అతనిమనోరాజ్య మెట్లు మిథ్యయయ్యెను?

## 50. లబ్ధనాశము.

సీ. కలఁ [1]దుగ్రవనములోపల నొక్క [2]మృగరాజు,
[3]గోమాయు వతనికిఁ [4]గూర్చు భృత్యు
డై పంపుచేయంగ న మ్మృగేంద్రుఁడు జంబు
కముఁజూచి పలికె [5]దైన్యము [6]దలిర

"వనఘ, [7]మహోదర వ్యాధి నాతనువున
[8]నొదవి యంతంతకు [9]మురముఁజొచ్చె;
ననుగుణంబగు మందు లరసి సేవింపక
యూరకుండిన [10]మీఁద [11]గొప్పకుండు

గీ. [12]గార్దభము కర్ణ కొకట్టి గలిగెనేని
యాపథంబున నది కూర్చి యారగించి
మచ్ఛరీరంబు రోగంబు మాన్పుకొందు;
గానఁ గొనిరమ్ము [13]ఖరము నాకడకు వేఁగ."

చ. అనిన 'మహాప్రసాద'మని
యామృగధూర్తముపోయి [14]రోయుచుఁ
జని [15]నగరోపకంఠమునఁ
జాకలివాని [16]కృశాంగ గార్దభం
బును బొడగాంచి సద్వినయ
పూర్వముగా మృదుభాషణంబులన్
గనికర మొప్పఁబల్కి యధి
కంబగు నేర్పునఁ [17]దెచ్చియిచ్చినన్.

గీ. ఉఱికి సింహమంత నుగ్రదంష్ట్రలు గల
ముఖమునం దుదగ్ర నఖములందు
[18]నొత్తిపట్టఁ దడవ యుసురువోయిన గార్దఁ
జూచి జంబుకంబుఁ జూచిపలికె.

గీ. "[19]దినముఖోచితకర్మంబు దీర్చి వచ్చి
యనుభవించెద; నందాఁక [20]నరసియుండు'

మనుచు సింగంబు నదికిఁ జనఁగఁ జూచి
జంబుకంబుఁ దలంచె మనంబులోన.

సీ. "దివ్యౌషధం బని తెప్పించి మృగరాజు
నన్నుఁ గావలిపెట్టి నదికిఁ బోయె;
నీమందు మృగపతి కేల పోవఁగ నిత్తు?
గ్రక్కున నతఁ డిందు రాకమున్న
భక్షించి నామేనఁ బరఁగు రోగము లెల్ల
హరియింతు" ననుచు మహాభిలాష
మొదవ గార్దభకర్ణ హృదయంబు లప్పుడు
[21]తొడిఁబడి దిని మూఁతి తుడుచుకొనుచు

గీ. నంత హరివచ్చి "యీగార్దభావయవము
లెక్కడికిఁబోయె నవు?" డన్న నెఱుఁగనట్లు
మూర్ఖచిత్తున కెందైన మొదలఁ గలవె
హృదయ కర్ణంబు లవి చూడ కెఱుఁగ కంటి." ౫

వ. కావున నీగార్దభంబునకు హృదయకర్ణంబులు లే"వనిన నట్లు
కాఁబోలు నని యా మృగేంద్రుం డూరకుండె. ౬

పంచ. లబ్ధ.

టీ. 1. భయంకరమైన యడవిలో. 2. సింహము. 3. నక్క. 4. ప్రియుఁడగు. 5. దీనత్వము. 6. అగపడునట్లు. 7. కడుపున పెద్దరోగము. 8. ఏర్పడి. 9. ఎక్కువ కానారంభించెను. 10. ఉత్తరకాలమున. 11. కీడుగల్గును. 12-13 గాడిద. 14. వెదకుచు. 15. ఊరిదాపున. 16. చిక్కిన యవయవములుగల. 17. పిలిచికొని తెచ్చి యప్పగింపఁగా.

18. అడివిపట్టినవెంటనే. 19. ఉదయ కాలకృత్యములను. 20. కాచి. 21. త్వరగా.

ప్రశ్నలు:—1. సింహమునకుఁ గల్గినవ్యాధి ఏమి? అందులకు మందు ఏది? 2. సింహము గార్దభము నేమి చెప్పి పంపెను? 3. గాడిదను చంపి సింహము వెంటనే ఏల తినలేదు? 4. నక్క సింహము నెట్లు మోసగించెను?

## 51 అహిభూసురోపాఖ్యానము.

సీ. అర్ధరాత్రపువేళ [1]నాఁకొన్న పాము దా
[2]నెరకునై యిట్టట్టుఁ దిరుగుచుండ
నవనీసురాన్వయు నర్భకుఁ డొక్కరుం
డాచమనార్థమై యరుగుదెంచె;
కానక యాతండు కడువడిఁ ద్రొక్కిన
[3]నత్యుగ్రభంగి పా మతని గఱవ
విషమెక్కి మూర్ఛిల్లె వేఁగ నాతం; డంతఁ
బిన్న పాపని తండ్రి భీతి మిగుల
గీ. [4]మంత్రవాదులఁ గొనివచ్చి మందు లొసఁగి
యతని బ్రతికించుకొని పాము నాత్మ దలచి
[5]యద్భుతోత్పన్న కోపారుణాక్షుఁడగుచు
బాంధవులఁజూచి యిట్లనె బ్రాహ్మణుండు ౧

క. "పసిపాపఁ డనక నాసుతుఁ
[6]గసుమాళపుఁ జెడుఁగుఁ బురుగు కఱచెను దీనిన్

[7]ముసుఁగువడు పాపమున నది
దెసలం జరియించుఁగాక దీనతతోడన్. ౨

గీ. సుతుఁడు నచ్చె నేని సుతునితో డనె కూడ
నరుగునట్లు గాఁగ నహి శపింతుఁ
జావఁడయ్యెఁ గాన జావని మన నట్టి
[8]యుగ్రయై చరించు నోరు మాలి. 3

ఉ. కప్పల మోచిమోచి కడఁ
గానక వానిన గొల్చి యాఁకటన్
గప్పిన నెవ్వగన్ [9]వనరఁ
గా నవిచూచి కృపాకటాక్షముల్
చొప్పడ గ్రాసమిచ్చి తమ
లో నొకఁడై చరియించువానిఁగా
నెప్పుడు నాత్మలం దలఁప
నీభుజగంబటు లుండుఁగావుతన్.

పంచ సంధి.

టి. 1. ఆఁకలిగొనిన. 2. తిండికొఱకు. 3. మిక్కిలి భయంకరరీతి. 4. మాంత్రికులను. 5. ఆశ్చర్యకరముగఁ గలిగిన కోపముచే ఎఱ్ఱవారిన కన్నులుగలవాఁ డగుచు. 6. మడ్డి చెడ్డ పురుఁగు (పాము). 7. ఆవరించు. 8. కొఱమాలినదై. 9. దుఃఖింపఁగా.

ప్రశ్నలు:—1. పామేల తిరుగాడుచుండెను? 2. బ్రాహ్మణ కుమారుఁ డేల బయటికివచ్చెను? 3. అతనిని బాముకఱచుట ఎట్లు ఘటిలెను. 4. బాలునితండ్రి యతని నెట్లు బ్రతికించుకొనెను? 5. బ్రాహ్మ

ణుఁడు పాముకు జావ శపింపమి ఏల ? 6. బ్రాహ్మణుఁడు పాము నేమని శపించెను ?

## 52. అహిభేకోపాఖ్యానము.

గీ. మందవిషుఁ డనుపేరిట [1]బొందుపడిన
యురగ మిట్టట్టు [2]నాఁకటఁ దిరుగుచుండి
కాంచె [3]మండూక గణ సమాక్రాంతి కలిత
జీవనంబగు నొక్క సరోవరంబు. ౧

క. కని యక్కొలని సమీపం
బునకుఁ జేరంగ నరిగి [4]భోగివిభుఁడు గ్ర
క్కున జలపాదుం డనియెడు
[5]ఘన భేకముఁగాంచి యనియెఁ [6]గంపితుఁ డగుచున్. ౨

క. "నా కడుపుకొఱకు దైవం
బీ కార్పణ్యంబు దెచ్చె; నెవ్వరి నడుగం
బోకుండితి గతకాలము;
మీకిదె భృత్యుండ నగుచు మెలఁగఁగ వలసెన్." 3

వ. అనుటయు భేకకులాధీశ్వరుం డయ్యహికిం గరుణించి "నీకు [7]ముదల వెట్టితి, నిక్కొలని మండూకంబులలోన నీవలసినవానితోడ నుదరపోషణంబు చేసికొని నాకు వాహన ప్రయోజనంబుదీర్పు" మనిన "మహాప్రసాదం" బని మందవిషుఁడు జలమధ్యంబునకుం జని.

చ. వలసిన కప్పలం గడుపు
వాఁచగ [8]బారణచేసి వచ్చి [9]ని
చ్చలుఁ దను పూను వాహనపుఁ
జందము కొండొక సేపుదీర్చి లో
పలి కుటిలత్వ మేమియును
[10]బాహిరమై చననీక యన్నిటిం
బలిగొని, వెన్క మ్రింగి జల
పాదుని, తాజనె స్వేచ్ఛనింటికిన్. ౫౨

పంచ. సంధి.

టీ. 1. ప్రసిద్ధుఁడైన. 2. ఆఁకలిచేత. 3. కప్పలగుమి నిండి యుండు నీరుగల. 4. పామురాజు. 5. పెద్దకప్ప. 6. భయపడ్డవాఁడగుచు. 7. ఆజ్ఞ. 8. తిని. 9. ఎల్లప్పుడు. 10. బయల్పడకుండునట్లు.

ప్రశ్నలు:—1. పామురాజు కప్పలదొర నేమని ప్రార్థించెను? 2. కప్పలదొర పామునకిడిన ముదలయేమి? 3. కడకు పాము కప్పల నేమి చేసెను, ఎట్లు?

## 53. అసంప్రేక్ష్యకారి.

చ. కలఁడొక పట్టణంబునను
[1]గ్రామణి వైశ్యకుమారుఁ డెల్లవా
రలుఁ గొనియాడునట్టి [2]వివ
రంబుగలం, డతిధార్మికుండు, పె
ద్దలయిన తల్లిదండ్రులును
దత్పరివారము రోగబాధలన్

[3]బాలిసిన, దాదిచేఁ బెరిగి,
[4]పూర్వవయః పరిపాకశాలియై. ౧

గీ. ఉండి సెట్టి బిడ్డఁ డొకనాఁడు తనదాదిఁ
జేరఁబిలిచి "నాకుఁ జెప్పు, మత్రివ,
యయ్య చేర్చినట్టి యరమెక్కడఁ బోయెఁ?
దెలిసి లేమి నెట్లు తిరుగువాఁడ?" ౨

వ. అనిన నయ్యుపమాత యిట్లనియె. ౩

గీ. "వెలయ నీవు జనించిన వేళఁ దొల్లి
దివ్యయోగీంద్రు నడిగినఁ దేటపఱిచె,
నిన్ని సంవత్సరంబులు నిట్టి మాస
మిట్టిదినమున [5]శ్రీకాంత యతనిఁ జేరు.

క. కల యని చూడకుమీ, నా
పలుకంతయు నిక్కువంబు, భావించి మదిం
దలపోసి యేను జెప్పిన
తెలివిం దగ నాచరింపు ధీయుక్తుఁడవై. ౪

సీ. అరుణోదయంబున హరిహర స్మరణంబు
చేయుము మేల్కాంచి చిత్త మలర,
దలదువ్వి ముడిచి, వస్త్రము పొందుగాఁ గట్టి,
చెనసి యాచమనంబుచేసి వచ్చి,
సుస్నానమొనరించి, సురభూసురార్చనా
యత్తచిత్తుం డెట్ల యట్లయుండు

తజే, వచ్చిభిక్షుకత్రయము నేముండటుఁ
బొడమినఁ గాని వారిఁ బూజచేసి

గీ. [6]లగుడమున మస్తకంబులు పగుల నడువఁ
[7]దాఁకు వడునట్టి భిక్షుకత్రయము పరాజఁ
దక్షణంబున ఘన నిధిత్రయము నగుచుఁ
గోటి సంఖ్యల [8]మాడల కుప్పలగును ౬

వ. అనిన విని యట్లు సేసి యతండు సంప్రాప్తధనుం డగుటయు దీని నెల్లఁ జూచి [9]నాపితుం డొకరుండు తనయింటికిని మువ్వురు భిక్షుకుల నాహ్వానితులం జేసి. ౭

గీ. మెచ్చు లొదవంగ నర్చనలిచ్చి వారి
కిచ్చవచ్చిన భోజనంబిడుచునుండి
త్వరితముగఁ బాజె వాకిట తలుపువైచి
శీఘ్రగతి ముట్టిలగుడంబుచేతఁ గొట్టె. ౮

క. అప్పుడు మొట్టో యనుచుం
దప్పక మువ్వురునుఁ గూయఁ దలవరులు వడిన్
[10]దప్పకొని [11]మదురు గోడలు
కుప్పించి యదల్చి వెఱవకుండు మిూరనుచున్. ౯

వ. ఆభిక్షుకత్రయంబును మోపించుకొని నాపితుం బెడకేలు గట్టికొనివచ్చి భూవరు సమ్ముఖంబునం బెట్టిన నతఁడు నాక్షౌరకునిం జంపించి తద్గృహంబు సర్వంబునుం జూఱ గొనియె. ౧౦

పంచ. అసం.

టీ. 1. గ్రామాధిపతి. 2. గుణములు. 3. చనిపోఁగా. 4. యౌవన ప్రారంభము వెలుఁగొందుట కలవాఁడై. 5. లక్ష్మి. సంపద. 6. దుడ్డు కఱ్ఱతో. 7. దెబ్బతగిలిన. 8. నాణెముల. 9. మంగలి. 10. దాఁటి. 11. కప్పుఁగల గోడలు.

ప్రశ్నలు:—1. గ్రామణి వైశ్యకుమారుం డెట్టివాఁడు? 2. ఏల వానికి దాది పోషణమే గతియాయెను? 3. అతనికి దాదిచెప్పిన ధనాగమ మార్గ మేది? 4. మంగలి యోచింపక చేసిన పనియేమి? 5. తుదకు మంగలి యేమాయెను?

చంద్రికాప్రెస్సు, చాకలపేట, మదరాసు.—6-7-49.

# వేదము వేంకటరాయశాస్త్రి అండ్ బ్రదర్స్,

4. మల్లికేశ్వరగుడిసందు, లింగిసెట్టివీధి, జి. టి. మదరాసు.

ఆర్డరుతోకూడ సగముసొమ్ము అడ్వాన్సు పంపవలెను.

(తపాలుచార్జి ప్రత్యేకము.)

## సంస్కృతగ్రంథములు.

మేఘసందేశము, మల్లినాథ వ్యాఖ్య - తెనుఁగున ప్రతిపద
టీకాతాత్పర్యపదప్రయోజనచర్చ-ఆక్షేపసమాధానములు. రు. 2 8

రఘువంశము మల్లినాథవ్యాఖ్య- తెనుఁగు టీతాత్పర్యములు.
మొదటి 6 సర్గలు 3 0

కుమారసంభవము, మొదటి 6 సర్గలు. పైదానివలెనే టీక. 3 0

అమరుకావ్యము శృంగారలక్ష్యము. వేమభూపాల సంస్కృత
వ్యాఖ్య. సంపూర్ణాంధ్రటీకయు. అచ్చగుచున్నది. 1 8

పుష్పబాణవిలాసము. సంస్కృతవ్యాఖ్య. తెనుఁగు పూర్ణటీక. 0 12

హితోపదేశము, మూలముమాత్రము 1 0

పంచతంత్రము, ,, 1 8

దశకుమారచరిత్రము ,, 1 0

వ్రతకల్పవల్లి (6 వ్రతములు) 0 12

బిల్హణచరిత్రము, తెనుఁగు పూర్ణటీక. (అచ్చగుచున్నది)

రసమంజరి, శృంగార రస స్వరూపవిస్తరము, సటీక. ,,

ప్రియదర్శికానాటిక, శ్రీహర్షకృతి సంస్కృతటిప్పణము
గద్య పద్యములుగా ఆంధ్రీకరణము సయితము 1 0

శబ్దమంజరీ సమాసకుసుమావళీ తిజంతమంజరులు, పాతప్రతి 0 4

## ఆంధ్రగ్రంథములు.

### పద్యకావ్యములు.

ఆముక్తమాల్యద సంజీవనీవ్యాఖ్య. 12 0

శృంగారనైషధము సర్వంకషావ్యాఖ్య (అచ్చగుచున్నది)

విజయవిలాసము, చేమకూర వేంకటకవి. టీకాసహితము. క్రొత్తయచ్చు 3

సారంగధరచరిత్రము ,, ,,

జ్ఞానవాసిష్ఠరామాయణము, వేదాంతము, మడికిసింగనకృతి 1 8

ఆంధ్రబిల్హణీయము, నిర్దోషము 0 8

పారిజాతాపహరణము, మూలము 0 8

సారంగధరచరిత్ర. ద్విపద (కవి విశ్వకర్మమతస్థుఁడు) 0 8

హరిశ్చంద్ర, ద్విపద, గౌరనమంత్రి ప్రణీతము 1 0

## నాటకములు.

ప్రతాపరుద్రీయనాటకము, సటిప్పణము, క్రౌనుసైజు 2 0

బొబ్బిలియుద్ధ టకము 1 8

ఉషా టకము, సటిప్పణము, క్రౌనుసైజు 1 8

శాకుంతలనాటకము, కాళిదాసీయమునకు తెనుఁగు 1 0

విక్రమోర్వశీయనాటకము, Inter Text నోట్సుతో 2 0

మాళవికాగ్నిమిత్రనాటకము 0 12

నాగానంద నాటకము (అచ్చగుచున్నది)

రత్నావళీనాటిక, శ్రీ ధరణికోట వేంకటసుబ్బయ్యగారివ్యాఖ్యతో 1 4

ప్రియదర్శికానాటిక 0 8

ఉత్తరరామచరిత్రనాటకము—విపులమగుపీఠికతో పునర్ముద్రితము 2 0

## సులభ వచనగ్రంథములు.

హితోపదేశకథలు, నీతిబోధకములు, (అచ్చగుచున్నది) 0 8

భోజ కాళిదాసకథలు, రసభరితములు. 0 12

బేతాళపంచవింశతిక 0 12

విక్రమార్కుని యద్భుతకథలు, గుణముకలిగించునవి. పునర్ముద్రితము 0 12

కథాసరిత్సాగరము, అద్భుతనీతి వ్యవహారకథలు, ఆఱుభాగములు 12 0

ఒక్కొకభాగము ప్రత్యేకముగా 2 8

ఆంధ్రదశకుమారచరిత్రము, మూలమునకు సరియైనయాంధ్రీకరణము 1 0

## లక్షణగ్రంథములు.

ఆంధ్రసాహిత్యదర్పణము. ఉదాహరణశ్లోకములతో 5 0
కావ్యాలంకారచూడామణి తొమ్మిది ఉల్లాసములు 1 8
అలంకారసారసంగ్రహము, సటీకాతాత్పర్యము 0 12
ఛందస్సు, విద్యార్థుల కుపయోగము, సంగ్రహము 0 4

## శారదాకాంచికలు – విమర్శలు – ఉపన్యాసములు.

జక్కన విక్రమార్కచరిత్ర ముద్రణవిమర్శనము 1 కింకిణి (అచ్చగుచున్నది)
ఆంధ్రప్రసన్నరాఘవనాటకవిమర్శ 2 కింకిణి ,,
కాళహస్తిమాహాత్మ్య ముద్రణవిమర్శనము 3 కింకిణి ,,
గ్రామ్యభాషాప్రయోగనిబంధనము. (పాత్రోచిత భాషనుగుఱించినది) 4 కింకిణి 0 12
మోచాకుసుమామోదవిచారము 5 కింకిణి ,,
ఆంధ్రవ్యాకరణసర్వస్వ విమర్శనము 6 కింకిణి ,,
విమర్శవినోదము, సంస్కృతాంధ్రకావ్యనాటకాది విషయకము 0 12
తిక్కన సోమయాజివిజయము 0 8. విసంధివివేకము 0 2
భారతాభారతరూపకమర్యాదలు, (నాట్యకళాచరిత్రము) 0 6
ఆంధ్రగ్రంథవిమర్శనప్రకారలేశము 6
గ్రామ్యాదేశనిరసనము, కడుపుబ్బనవ్వించు విమర్శ 6
స్త్రీపునర్వివాహగ్రంథము 0
ఆంధ్ర హితోపదేశచంపువు, గద్యపద్యాత్మకము 4
ఆంధ్ర భాషాసర్వస్వార్థనియమకతిపయములు (నిఘంటురచనావిధి) 0 4

## క్రొత్తగా వెలువడిన గ్రంథములు.

కుమారదేవపండితీయము, ప్రౌఢవ్యాకరణవ్యాఖ్య. తాళ్లూరివారిది 2 8
పద్యకథాలహరి For Comprehension Test అప్రూవుడు 0 12
ఉదయనచరితము. శ్రీ శాస్త్రిగారి కథాసరిత్సాగరమునుండి పాఠశాలలకొఱకు సంగ్రహింపఁబడినది. వచనము అప్రూవుడు 0 12

తెలుఁగు ఫైలాలజీ TELUGU PHILOLOGY ఆంధ్రశబ్ద తత్త్వము. కీ. శే. శ్రీ ప్రొఫెసరు, శేషగిరిశాస్త్రిగారిచే రచియింపఁబడినది. ఇప్పుడే పునర్ముద్రితము. ఇందు ఆంధ్రవ్యాకరణము సంపూర్ణముగా చర్చింపఁబడియున్నది. అరవము, కన్నడము, మలయాళీ భాషలతోడి పోలికలు చూపఁబడియున్నవి. ఫైలాలజీవిద్యార్థులకు చాల ఉపయోగకరము 2 భాగములు 3 0

అర్ధానుస్వారతత్త్వము. వీరిదే. 0 8

చరిత్రరచన. ప్రథమభాగము. చరిత్రరచన యనగా నేమి? సాధన సామగ్రి ఎట్టిది? అనువిషయములను చర్చించి శాతవాహన, పల్లవ, చాళుక్య, చోళుల ప్రారంభచరిత్రములను ఈభాగమున సులువైనశైలిలో ఎల్లవారికిని ఉపయోగపడునట్లు శ్రీ నేలటూరు వేంకటరమణయ్యగారు రచియించియున్నారు. 2 0

అక్కన్న మాదన్నలచరిత్రము. కర్త: వే. వేం. శాస్త్రి (M. A.) గోలకొండ కుతుబుషాహి సుల్తానులలో కడపటివాఁడైన తానీషాయొక్కయు, రామదాసు (గోపన్న)యొక్క మామలైన ఈయాంధ్రమంత్రులయొక్క విషాదచరిత్రము సులువైన నవలవలె రచియింపఁబడియున్నది. 2 0

శ్రీకృష్ణరాయవిజయనాటకము. కర్త: వే. వేం. శాస్త్రి (M. A.) 0 8

వేదము వేంకటరాయశాస్త్రులవారి జీవితచరిత్రసంగ్రహము—25 ప్రకరణములు. సులువైనశైలి. శాస్త్రులవారి హాస్యము, విమర్శలు, విద్యావినోదములు, సుఖదుఃఖములు, సమకాలికపండితవిమర్శలు మొదలైన యనేకవిశేషములు గలవు. శ్రీ డాక్టరు,సర్,కట్టమంచి రామలింగారెడ్డిగారి 'గురుపూజ' యను నుపన్యాసముతో నలంకృతము. 2 0

**A HAND-BOOK OF CLASSICAL SAMSKRIT LITERATURE for college students.** (Sri U. Venkatakrishna Rao, M. A.) With Questions. 2 0